## రచయిత ప్రచురణలు

ఆధునిక స్త్రీ
మనం దేనికి బానిసలం
తల్లే పిల్లను చంపితే
విముక్తి ఉద్యమాలు: మహనీయులు
ఓ మహిళా! ముందుకు సాగిపో
మారుతున్న సమాజం మహిళలు
మహిళాభ్యుదయం — వ్యాస సంకలనాలు
మాతృత్వానికి మరోముడి — కథా సంపుటి
వెలిగిన జ్యోతి — నవల

## అచ్చులో

చీకటి వెలుగులు — నవల
రాణి రుద్రమదేవి — బాలలనవల
ఈదేశం నాదేనా — చిన్న నవల
నవోదయం — నవల
వలపు పంజరం — నవల
ఇస్లాం : స్త్రీలు
క్రైస్తవం : స్త్రీలు

## రాబోవు రచనలు

వివాహ వ్యవస్థ
ఆంధ్రప్రదేశ్‌లో మహిళోద్యమం
**Women's Movement & organisations**
**Women: Tradition & Culture**

# మహిళా అభ్యుదయము



మల్లాది సుబ్బమ్మ




ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్
8, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం,
హైదరాబాద్ - 500 028

ప్రజాస్వామ్య ప్రచురణలు నెం. **20**

# మహిళా అభ్యుదయము

రచన: మల్లాది సుబ్బమ్మ

ప్రథమ ముద్రణ 1983
ప్రతులు 1000


పబ్లిషర్సు:-
ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్.
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ
మెహిదీపట్నం, హైదరాబాద్ 500 028.

సోల్ డిస్ట్రిబ్యూటర్సు:-
వికాసం
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ
మెహిదీపట్నం, హైదరాబాద్ 500 028
ఫోన్ నెం. 31423

వెల రు. **7-50**

ముద్రణ
లిబర్టి ప్రింటర్సు
చీరాల - 523 155.

# విషయసూచిక

## మహిళా అభ్యుదయం

# స్వవిషయం

"ప్రజాస్వామ్య ప్రచురణలు" ఒక వినూత్న ప్రయత్నం. ఇతర సంస్థలతో రూపసామ్యం వున్న. ఆదర్శాలలో, లక్ష్యసాధనా విధానాలలో, కార్యాచరణ రీతులలో భిన్నమైనది.

వ్యక్తి జీవితంలో, సమాజ జీవితంలో అన్ని రంగాలలో ప్రజాస్వామ్యం వెల్లివిరిసి మూడు పూవులు, ఆరు కాయలుగా వర్ధిల్లాలని ఈ సంస్థ అభిమతం, ఆశయం కూడాను.

ఇలాంటి ప్రయత్నాలు పూర్వం జరిగినవి. ప్రస్తుతం జరుగుచున్నవి. కాని, వానికీ-ఈ ప్రయత్నానికీ తారతమ్య మున్నది. ఉదాత్తమయిన ఆశయాలతో, ఉత్తేజంపొందిన మేధావుల సమిష్టి సహకార కృషి ఫలితంగా ఈ సంస్థ ఉద్భవించింది.

విశ్వ జనీనతే దీని విశిష్టత. మొత్తం మానవ ప్రపంచ సంస్కృతీ సాహిత్యాలు దీని వారసత్వం. ముఖ్యంగా భారతదేశ సంస్కృతిలో ఇంత వరకు మరుగున పడిన మాణిక్యాలు—చార్వాక, కపిల, కణాదుల మతాలు, సిద్ధాంతాలు దీని సొమ్ము. తెలుగుదేశమే కాదు, తెలుగు భాష విస్తరించిన ప్రాంతమంతా దీని కార్యక్షేత్రము.

ప్రపంచంలో విప్లవాలు ఎక్కడ వచ్చినా, ఏ కాలమందు జరిగినా, అవన్నీ దీనికి అధ్యయన యోగ్యాలే. ఇంగ్లండులో 1689లో బ్రిటిషు రాచరికానికి పరిమితులు, హద్దులు విధించిన విప్లవం: అమెరికాలో 1773 లో ప్రాతినిధ్యాధికారమున్న వారే పన్నులు విధించగల హక్కుదారులనే 'ప్రజాస్వామ్యం' సూత్రాన్ని ఎలుగెత్తి చాటిన విప్లవం: 1789 లో స్వేచ్ఛ, సమానత్వము, సౌభ్రాతృత్వము ఆదర్శాలుగా విజయవంతమయిన ఫ్రెంచి విప్లవం; 1917 లో 'భూమి, తిండి, శాంతి' నినాదాలతో కార్మికవర్గం, మధ్యతరగతి రష్యాలో సాధించిన విప్లవం: 1947 లో భారతదేశం పొందిన స్వాతంత్ర్యం; 1949లో కర్షకబలం చైనాలో జరిగిన విప్లవం మొదలయిన చారిత్రాత్మక సంఘటనలను లోతుగా, సునిశితంగా, సమ్యక్‌దృష్టితో పరిశీలించి తదనుగుణమైన ప్రచురణలు చేయాలని ఈ సంస్థ ఆదర్శం.

సామాజిక పరివర్తనకూ, భావగమనానికి అవినాభావ సంబంధమున్నదనే విషయం జగద్విదితం. అయితే భావాలు ప్రాతిభాసికాలేనా

నియంతృత్వ సిద్ధాంతాలు అమలుపరచ జూచే సమగ్ర యాంత్రీకరణను త్రోసి రాజంటుంది. సమాజం యెడ బాధ్యతతో సమ్మిళితమైన వ్యక్తి స్వేచ్ఛను లక్ష్యంగా స్వీకరిస్తుంది. భౌతిక అవసరాలను తీర్చటం, భౌతిక పరిస్థితులను మెరుగుపరచటం అనే పేరుతో పైన పేర్కొనబడిన వ్యక్తి స్వేచ్ఛను త్యజించ నిచ్చగించదు. మానసిక స్వేచ్ఛ, మౌలిక చింతన లేనప్పుడు అభ్యుదయం అసాధ్యం.

పిడివాదాన్ని, పిడివాదపు సిద్ధాంతాన్ని త్రోసిరాజని హ్యూమనిజం స్వేచ్ఛను ప్రబోధిస్తుంది. నైతిక విలువలను, సృజనాశక్తులతో సమ్మిళిత మైన జీవిత విధానాన్ని, వ్యక్తి వికాసాన్ని లక్ష్యంగా అంగీకరిస్తుంది. మారుచున్న సమాజానికి అనుగుణంగా అభ్యుదయ పథంలో అనుసరించ దగిన మౌలిక జీవిత సూత్రం ఇది.

విజ్ఞానాన్ని ప్రపంచ శాంతి కొరకు వినియోగించ గలిగితే ప్రస్తుత విషమ స్థితినుంచి మానవాళి విముక్తి చెందగలదు. భయవిముక్తుడైన మానవునిపరిపూర్ణ వికాసానికి పరిమితులుండకూడదు. ఈ తాత్విక ఆలోచనా రీతిని మానవ ప్రపంచం ప్రస్తుతం ఎదుర్కొనే సవాలుకు సరియైన జవాబుగా భావించవచ్చును.

ఇలాంటి తాత్విక ధోరణి స్వేచ్ఛా భావుకతను పోషిస్తుంది. కనుక అన్ని సామాజిక రంగాలలోను వినూత్నమయిన రీతిలో స్వేచ్ఛను పెంపొందించి అభ్యుదయ మార్గాన అడుగుల వేయించగల నూతన భావాన్వేషణయే 'ప్రజాస్వామ్య ప్రచురణల సంస్థ' ధ్యేయం.

అట్టి భావాలను ప్రజాబాహుళ్యానికి ఎరుకపరచటం ఈసంస్థ ప్రథమ కర్తవ్యంగా భావిస్తుంది. ఇది సాహసమే కావచ్చు. ప్రమాదభరితం కూడా కావచ్చు. కాని లక్ష్యసాధన కొరకు చేసే ఇట్టి కృషిని విస్మరించ జాలము. ఈ ప్రయత్నానికి, వ్యాపారానికి స్వేచ్ఛాపిపాసకలు వ్యక్తు లందరి సానుభూతి సహకారాలను అర్థిస్తున్నాము.

సభ్యులు : శ్రీ ఎం. వి. రామమూర్తి
శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి
శ్రీ గుంటుపల్లి గోపాలరావు
శ్రీమతి మల్లాది సుబ్బమ్మ
శ్రీ గురిజాల సీతారామయ్య
శ్రీ కొల్లా సుబ్బారావు

ఎం. వి. రామమూర్తి
అధ్యక్షుడు
బోర్డు ఆఫ్ డైరెక్టర్స్

# నా సాహితీ యాత్ర

ఆమె ఆడది. ఈదేశంలో పుట్టిన ఆడది విద్యలేక, విజ్ఞానం అసలే లేక మతకబంధహస్తాలలో, పురుషుల ఇనుపసంకెళ్ళలో బంధింపబడ్డ ఆడది వాళ్ళ కాళ్ళక్రిందపడి నల్లిలా నలిగి అణగారిపోతున్న ఆడది. సంరక్షకత్వంవల్ల ఆర్థిక స్వేచ్ఛపోగొట్టుకొన్న అబల ద్వందనీతివల్ల సామాజిక దోపిడీకి గురి అయిన నిర్భాగ్యురాలు కాదంటారా? ఔనంటే మరేంచెయ్యాలి? అందుకే సాంఘిక ఔన్నత్యం కోసం, సమసమాజ నిర్మాణంకోసం, భారతనారీస్వేచ్ఛా,సమాన త్వాలకోసం రచనయే మార్గదర్శకమనే ధ్యేయంతో నేనీవ్యాసావళిని ముద్రి స్తున్నాను. ఇలాంటి సాహిత్య సమిధలతో సాంఘిక దురాచారాలను, మహి ళలపై జరిగే అత్యాచారాలను కాల్చివేసి మహిళా లోకానికి సేవచేయాలనే తీవ్రమైన ఆకాంక్ష నాలో ఉత్తేజాన్ని కలిగించింది. నా కలాన్ని కది పింది. ఈనాటి వ్యవస్థలోని లోపాలను స్త్రీల కొరకు ఏర్పరచిన దురాచారాలను, అరాజకాలను ఎత్తిచూపాలనేదే నా ఆరాటం. స్త్రీ స్వేచ్ఛకోసం, సమానత్వం కోసం సమాజంలోని కుళ్ళును, అవినీతిని బట్టబయలు చేయాలనేదే నా ధ్యేయం.

సమతా నినాదం ఈ నాడొక ఫ్యాషను అయింది. ఈనాడు వేదిక లెక్కి స్త్రీలకు సమానత్వం అక్కరలేదని, వారికి ప్రాతినిధ్యం ఇవ్వరాదని, వారిని తక్కువగా చూడాలని, వారి శ్రమకు తక్కువ ఫలితం ఇవ్వాలని అనగల ధైర్యమున్నవారు అరుదు. కాని ఈనాటి ఉపన్యాసాలు, శాసనాలు కాగితాలకే పరిమిత మవుతున్నాయి. మహిళాభ్యుదయం ఆచరణలో మాత్రం మృగ్యం ఆయింది. స్త్రీ పూజనీయురాలని, చట్టంముందు, దైవంముందు హెచ్చు తగ్గులు లేవని అన్నిమతాలవారు బీరాలు పలుకుతారు. అందువల్లే ఈ 'పురుషసూక్తాలు' స్త్రీలు నమ్మేరోజులు పోయినాయి.

అసలు స్త్రీ జీవితమే సమస్యల విషవలయం. ప్రతి సమస్యా ఒక వ్యాసం వ్రాయవచ్చు; ఒక కథగా, నవలగా వ్రాయవచ్చు. సమస్యలకు పరిష్కారం చూపేవారు కొందరైతే, అవి పాఠకులకే వదలి వేయాలనేవారు మరికొందరు. వ్యాధి లక్షణాన్ని వివరిస్తే చాలదు; వ్యాధికిమూల కారణమేదో

కనిపెట్టి దానికి తగిన చికిత్స చేయగలవాడే నిజమైన వైద్యుడు. అలాగే సృజనాత్మకశక్తి, వాస్తవిక అవగాహన, సామాజికస్పృహ, విమర్శనాపటిమ గల రచయితే జీవిత సత్యాలను శోధించగలడు. నేటి స్త్రీల ఆర్థిక, సాంఘిక, నైతిక పరమైన వర్తమానస్థితిగతులను వెలికితెచ్చి సమ్యక్ దృష్టితో వాటిని పరిశీలించి పరిష్కారమార్గాలను సూచిస్తూ పాఠకులకు అందివ్వాలనే తపనే నన్నీ సాహిత్య ప్రక్రియకు ప్రోత్సహించింది. ఇదే నా సాహితీ యాత్రకు నిజమైన ప్రాతిపదిక.

తరం మారినప్పుడల్లా సంప్రదాయాలు, ఆచారాలు, సిద్ధాంతాలు మారుతూవుంటాయి. అలా మార్పుచెందనిచో వాటి ఉనికే లేనట్లు. భావ విప్లవంతోపాటు సాహితీ విప్లవం రాకతప్పదు.మానవ జీవిత సంస్కృతికి అద్దంవంటిది సాహిత్యం. ఆ సాహిత్యం ద్వారా నలిగిన స్త్రీ జీవితాన్ని వెలికితెచ్చి ఆమెలో ఆశాజ్యోతులు వెలిగించాలనేదే నాతపన.

పురుష సంస్కృతి అనే కాలసర్పం నేటి స్త్రీని కాటేసింది.సంప్రదాయం, ఆచారం, పవిత్రత అనే విషసర్పాలు ఆమెపై ఆజన్మాంతం బుస కొడుతూనే వున్నాయి. వివాహ వ్యవస్థ, దాంపత్యజీవితం ఆమె స్వేచ్ఛను, సుఖాన్ని అరికడుతున్నాయి. తన కోసం సృష్టించుకొన్న సంఘానికి, చట్టానికి తానే బందీ అయినట్లు స్త్రీ అనేక కట్టుబాట్లలో బంధింపడి, గందరగోళంలో పడిపోయి తన కర్తవ్యాన్ని విస్మరిస్తోంది. స్త్రీ పట్ల పురుషదౌష్ట్యాన్ని, సామాజిక కుళ్ళును, రాజకీయ నిరసనను, ఆర్థిక అసమానత్వాన్ని బహిర్గత పర్చటానికే నేనీ సాహితీయత్నాన్ని చేపట్టటం జరిగింది. అందుకే నవలలు, కథలు, వ్యాసాలు, ఉపన్యాసాలు నేను ఎన్నుకున్న సాహితీ రీతులు.

'నాకు పురుషద్వేషి, స్త్రీ పక్షపాతి, కుటుంబ శాంతి విధ్వంసకురాలు' అనే బిరుదాలిస్తూ ఎగతాళి చేస్తుంటారు. ఆ గుసగుసలు వింటూంటే నాకు బాధఅనిపించదు. కాని ఆడవాళ్ళను 'అయ్యోపాపం' అంటూ కనికరించడం, 'దిక్కుమాలినది' అంటూ జాలితో చూడటం, నీచంగా మాట్లాడటం 'ఈ పనికి ఆడదే తగినది' అని వేలెత్తి చూపడం, సానుభూతితో ఏదోఒక

పదవి మోహాన పారేయడం, ప్రతి కమిటీలో ఒక స్థానం కేటాయించడం లాంటి వ్యక్తులను, వారి వ్యవస్థను చూస్తుంటే ఒళ్ళు భగ్గున మండుతుంది. పని విభజనతో టీచరు, నర్సు, టైపిస్టులాంటి విసుగుపుట్టే పనులకు "ఆడాళ్ళే' తగుదురన్నట్లు ఇవ్వటం చూస్తుంటే "అది వారి దృష్టిదోషమా? బధిరత్వమా? అన్నంత ఆవేదన కలుగుతుంది. మహిళలు నోరుమూసుకుని పడివున్నాన్నాళ్ళు ఈభాగోతం ఇంతే ! !

మానవ హక్కుల్ని అమెరికను, ఫ్రెంచి, రష్యను విప్లవాలు ఉద్ఘాటన చేసిన తదుపరి స్త్రీలను మానవులుగా పరిగణించడం జరిగింది. కనుక సమాజ సమస్యలను పరిష్కరించటానికి స్త్రీలు సైతం భాగస్వాములు కావాలి. అసలు స్త్రీల సమస్యలు భారత సమాజ సమస్యలలో భాగం కావనే దుష్ట భావనవల్లే మనమూ, మన సమాజమూ అల్లకల్లోలంలో పడిపోయాం. సమాజంలో స్త్రీ స్థానానికి, సామాజిక వ్యవస్థకూ సన్నిహితత్వం లేదనుకొనటం భ్రమ; అవివేకం కూడాను. ఈ నాటి మహిళోద్యమ లక్ష్యం తమ సమస్యలను, స్థితిగతులను సరిదిద్దుకొనటం మాత్రమేకాదు. యావత్ ప్రపంచ సమస్యలను, అశాంతిని పరిష్కరించటంలో మహిళలు భాగస్వాములు కావాలనేదే లక్ష్యం కావాలి. దేశ సమస్యలను పురుషులు సరిదిద్దే వరకూ స్త్రీలు మిన్నకుండటం భావ్యంకాదు. తాము సమాన హక్కులకోసం పోరాడుతూ దేశసమస్యలను పురుషులకే వదలివేయుటం అసమంజసం, నిష్ప్రయోజనం కూడా. వివేకం, చైతన్యంకల మహిళలు సామాజిక మార్పు ప్రగతికోసం పోరాటం, తిరుగుబాటులాంటి ఉద్యమాలలో భాగస్వామ్యం వహించాలి. ఏ ఇతర మానవుడితోనైనా సమాన హోదా పొందాలంటే తమ బాధలు, సమస్యలు భారత ప్రజానీకపు దుఃఖంలో, బాధలలో మిళితమయి ఉంటాయి కాని పూర్తిగా వేరుకావు అనేభావం అవసరం. ఈ నాటి మహిళోద్యమవైఖరిలో సిద్ధాంతపరంగాను ఆచరణలోనూ కొంతమార్పుఅనివార్యం అవుతున్నది. ఆ మార్పును గుర్తించగలస్థాయి ప్రజలలో రాక తప్పదు; వస్తుంది: రావాలి.

పురుషద్వేషంతో స్త్రీల సమస్యలు చక్కబడతాయని నమ్మని వారిలో నేను మొదటిదాన్ని. స్త్రీలంతా మహాగుణ వంతులని, పురుషులందరూ

నియంతలని నిర్వచించటం అమానుషమేకాదు, మహాపరాధం కూడా అవుతుంది. ఏదయినా 90% జరిగేదాన్ని మొత్తంమీద నిజంగాచెప్తాం. కనుక నేటి పురుషాధిపత్య సమాజ ధోరణిని ఈ చిన్ని వ్యాసావళిలో విమర్శించటం జరిగింది. ఇందులో భారత దేశంలో స్త్రీల పరిస్థితిని, దేశదేశాల స్త్రీల సమస్యలను కొంతవరకు చర్చించాను. 'నాకు తెలిసింది బహు తక్కువ; తెలియాల్సింది చాలఎక్కువ. అలాగేరాసింది అతిస్వల్పం; రాయాల్సింది అనంతంగా ఉంది' అని సవినయంగా మనవి చేస్తున్నాను. ఇందులోని పొరపాట్లను, తప్పులను సహృదయంతో చదువరులు మన్నించగలరు.

## కృతజ్ఞతలు

ఈ వ్యాసాలు అనేక వార, మాస, పక్ష పత్రికలలో ప్రచురణ యోగ్యత పొందాయి. కొన్ని రేడియోలో, టి. వి. లో ప్రసారమయినాయి. సెమినార్లలో, చర్చావేదికలలో, సభలలో చేసిన ప్రసంగాలు కొన్ని ఉన్నాయి. విన్ (Win: Women's International Network News) అనే అమెరికను పత్రిక అందించిన సమాచారం ఆధారంతో రాసినవి మరికొన్ని. వీరి అందరి సౌజన్యానికి నేను కృతజ్ఞురాలను.

ఈ పుస్తక రచన సందర్భంగా అనేక సలహాలనిచ్చి తోడ్పడి పరిచయ వాక్యం కూడా వ్రాసియిచ్చిన నా సహచరుడు ఎం. వి. రామమూర్తి గారి సహకారాన్ని నేను విస్మరించలేను. గ్రంథ ప్రచురణలో నాకు సహాయం చేసిన మిత్రుడు రావిపూడి వెంకటాద్రిగారికి నేను ఋణపడి ఉన్నాను. సకాలంలో ఈ పొత్తాన్ని అచ్చువేసి అందిచ్చిన లిబర్టీప్రింటర్స్, చీరాల వారికి నా కృతజ్ఞత.

రచయిత.

మల్లాది సుబ్బమ్మ

# ప రి చ యం

స్త్రీ పురుషులు సమానులని విశ్వమానవ హక్కుల పత్రంలో, భారత రాజ్యాంగంలో పేర్కొనడం జరిగింది. కొన్ని దేశాలలో స్త్రీలకు రాజకీయ స్వాతంత్ర్యంవుంటే సామాజిక,సాంస్కృతిక స్వేచ్ఛలు లేకుండా వున్నాయి. మరికొన్ని దేశాలలో సామాజిక స్వేచ్ఛవున్నా, రాజకీయాధికారం మహిళలకు అల్లంతదూరానవుంది. పెట్టుబడిదారీ అమెరికాలో ఇంటిపనిలో పురుషుడు పాల్గొంటే, సోషలిష్టు రష్యాలో ఇంటిపని అంతా ఇల్లాలే చెయ్యాలి. మధ్య ప్రాచ్యంలో స్త్రీలకు ముసుగు తప్పనిసరి అయితే, కొన్ని దేశాలలో ఆమెకు సాంఘిక స్వాతంత్ర్యం హెచ్చుగావుంది. పురుషాధిక్యసమాజపు దేశాలయిన ఇజ్రాయిల్, శ్రీలంక, ఇండియాలాంటి దేశాలు మహిళలను ప్రధాన మంత్రులుగాచేసి తృప్తి పడ్డాయి. మొత్తంమీద స్త్రీ పురోగతి నత్తనడక నడుస్తోంది. ఆమె శరీరంపై ఆమెకు హక్కులేదు. సంతానం కనే విషయంలో ఆమెకు స్వేచ్ఛలేదు. ఆమెను ఎంతసేపూ భోగ్యవస్తువుగా చూడటం పరిపాటి అయింది. ఆమెకు తాము విద్యను అందివ్వక అర్హత ఆమెకు లేదని నిందించి అధికార కేంద్రాలకు దూరంగా వుంచుతున్నారు. నిరక్షరాస్యత నిర్మూలనమైన దేశాలలోకూడా రాజకీయాధికారానికి ఆమె సుదూరంగా ఉంచబడుతోంది. ఈ లక్షణం పెట్టుబడిదారీ దేశాలలోను సోషలిష్టు దేశాలలోను-రెంటిలోను ప్రస్ఫుటంగా కనబడుతోంది. అందువల్ల స్త్రీ విమోచనోద్యమం విప్లవోద్యమంతో ఎలాంటి సంబంధం కలిగి వుండాలనేది ప్రపంచం మొత్తం మీద చర్చనీయాంశమయింది. స్త్రీ విమోచన విప్లవ కార్యక్రమంలో విధిగా భాగంకావాలని కొంతమంది వాదిస్తుంటే మరికొందరు విప్లవోద్యమం సఫలమయ్యే వరకూ మహిళోద్యమాన్ని ఉధృతం చేయరాదని వాదిస్తున్నారు. విముక్తి ఉద్యమాల తదనంతరం వచ్చిన మార్పులను గమనించిన వారు ఈ వాదాన్ని నిరసిస్తున్నారు. తోడునీడగావుండి పోరాడిన మహిళ గెరిల్లాలను వంటఇళ్ళకు పంపించిన తర్వాత వారికి స్త్రీ విమోచన ఆవశ్యకత యొక్క తీవ్రత, గాఢత అర్థమయ్యాయి. స్త్రీ విమోచన ప్రధానాంశం కాని విప్లవం నేతి బీరకాయ లాంటిది.

మహిళాభ్యుదయాన్ని అహరహము కాంక్షించే శ్రీమతి సుబ్బమ్మ స్త్రీల సమస్యలను పరిశీలించి తమ భావాలు వ్యాసరూపంగా వెలువరించింది స్త్రీ విమోచనపట్ల ఆసక్తిని, ఆర్తిని, ఆకాంక్షను ఈ వ్యాస పఠనం పెంచ గలదని నేను ఆశిస్తున్నాను.

ఎం. వి. రామమూర్తి.

# మనస్త్రీలు : మతసంస్కృతి

"సంప్రదాయాన్ని మీరు పోషిస్తున్నారు సంస్కృతిని మీరే పరిరక్షిస్తున్నారు. కుటుంబానికి మీరే ఆధారం. మీరురాజకీయాల్లోకి రావద్దు. రాజకీయాల్లో స్త్రీలకు స్థానంలేదు. గతంలో మీకు ఓటులేదు; మీ మాటకు విలువలేదు. మీరు మా సంరక్షకత్వంలోనే వుండండి. కుటుంబ పెద్ద అయిన మీ భర్త సేవచెయ్యండి. వంశాన్ని ఉద్ధరించండి. అది మీ విద్యుక్తధర్మం అదే భారతనారీ సంస్కృతి దాన్నే తిరిగి పునరుద్ధరించండి. ఆ అవకాశం మీకు లభించినందువల్ల మీరు ధన్యులైనారు." వేదికలెక్కి రాజకీయ నాయకులు, ప్రొఫెసర్లు, మతాధికారులు స్త్రీలను ఇలా ఉద్వేగపర్చటం అన్నిదేశాల్లో, అన్నికాలాల్లో జరుగుతూనేవుంది. ఇలాంటి వ్యవస్థను ప్రపంచంలోని పురుషులంతా బలపరిచి పోషిస్తున్నారు. ఎదురు తిరిగిన స్త్రీల ప్రాణాలను తీసి అయినాసరే వారు ఆ సంస్కృతిని నిలబెడతారు. ప్రతి సమాజంలోనూ, ప్రతి సంస్కృతిలోనూ స్త్రీలపై పెత్తనం సాగించటం ద్వారా పురుషులు లాభిస్తున్నారనే విషయం స్పష్టంగా ఋజువయింది. జాతీయ ఉత్పత్తిలో స్త్రీలు ఇళ్ళల్లో చేసే బండచాకిరి పరిగణనలోకిరాదు. సంప్రదాయం పేరుతో స్త్రీలను పాతకాలపు సంస్కృతిలోకి నెట్టి వాళ్ళను తమ అదుపులో వుంచటానికి పురుషులు అవలంభించే మార్గాలు కాలానికి, దేశానికి మారవచ్చు; కాని వారి లక్ష్యాలు మాత్రం ఒకటే ఇది సర్వత్రా గోచరిస్తున్న నగ్నసత్యం. విశ్వవ్యాప్తంగా ఉన్న ఈ అంతస్తుల సమాజంలో స్త్రీ తలవంచి పురుషాధిపత్యానికి శరీర, ధన, మాన, ప్రాణాలను అర్పించి వ్యక్తిత్వంలేని ఆటబొమ్మగా జీవిస్తోంది. ఇదీ జరుగుచున్నకథ.

ప్రపంచ వ్యాప్తంగా స్త్రీ పురుషుల మధ్య తారతమ్యాలకు ముఖ్య కారణం మత సంస్కృతి, సనాతన సంప్రదాయం. ఎందరో మత ప్రవక్తలు ఉద్భవించారు. మరెన్నో మత సంస్కరణోద్యమాలు వెలిసాయి. ఇవన్నీ పురుషాధిపత్యాన్ని బలపరచినవే భగవద్గీత స్త్రీలు పాపగర్భంనుండి జన్మించారంటుంది. ఇస్లాం స్త్రీలను జంతువులతో, దున్నే పొలంతో పోల్చింది. క్రైస్తవం స్త్రీ పాపాలకు మూల కారణం అంటూ దేవుడు పురుషుని ముందు సృష్టించి అతని సంతోషంకోసం స్త్రీని సృష్టించాడని ఉద్ఘాటించింది.

హిందూమత సంస్కర్తల్లో ముఖ్యుడైన బుద్ధుడుసైతం సంస్కరణలలో స్త్రీల పాత్రను నిరశించాడు. శంకరాచార్యుడు స్త్రీలు నరకానికి సింహద్వారం వంటి వారన్నాడు. మనుస్మృతి స్త్రీలకు ఆజన్మాంతం సంరక్షత్వం ప్రతిపాదించింది; స్త్రీని బానిసత్వానికి చిహ్నంగా, ఆటబొమ్మగా మార్చేసింది. ఇలా అన్ని మతాలు స్త్రీని విధేయత చూపమని నిర్దేశించాయి. ఈ భావాలు తరతరాలుగా నరనరాన జీర్ణించుకొన్న స్త్రీలు 1955 లో హిందూకోడ్ బిల్లుకు వ్యతిరేకంగా స్త్రీలకు హక్కు లివ్వరాదని వాదించిన మతవాదుల్ని బలపరచి తమకు తామె ఉన్నబానిసత్వాన్ని ఇంకాఘట్టిగా బలపరచుకున్నారు. ఇలా ఆడపి జన్మించినదాది మతం నిర్దేశించిన ధర్మాన్ని మనో వాక్కాయ కర్మల ఆచరించేటట్లు ఆమెకు 'బ్రెయిన్‌వాష్' చెయ్యబడింది. ఈ సమాజపు సంప్రదాయానికి,సంస్కృతికి విరుద్ధమైన ఆలోచనఆమెచెయ్యలేదు.కనుకనే ఆధునిక భావాలు, శాస్త్రీయ దృక్పథం స్త్రీలలో మృగ్యమై వంటఇంటికీ, పడకటింటికి పరిమితమైనారు. ఈనాడు చట్టం, సమాజం కొన్నిహక్కులు, విద్యా, ఉద్యోగావకాశాలు కల్పించినా వారు స్వీకరించే స్థితిలోవున్నారా? అనేదొక బలీయమైన ప్రశ్నగానే మిగిలిపోయింది.

స్త్రీలలో చైతన్యం కావాలని కొందరూ, వారిని అదుపులో వుంచాలని మరికొందరూ వాదిస్తున్నారు. చైతన్యమూ, అదుపూ పరస్పర విరుద్ధాలు. అయినా పాశ్చాత్యదేశాల్లో, పారిశ్రామికంగా అభివృద్ధి చెందినదేశాల్లోకూడా స్త్రీలు రెండో తరగతి పౌరులుగానే చలామణీ అవుతున్నారు. వారు మహిళా విమోచనోద్యమాలద్వారా పోరాడుతూనే వున్నారు. కొన్ని దేశాల్లో సాంఘికంగా, సాంస్కృతికంగా సమానత్వం పాటిస్తారు. కాని రాజకీయాల్లో చోటు పెట్టరు. బ్రిటన్‌లో ఆక్సుఫర్డు యూనివర్సిటీలో స్త్రీలకు పొపెసర్ల పదవిగాని, ఆఖరికి వారికి సీట్లుకూడా ఇచ్చేవారుకారు ఇటీవలివరకు, మూడు దశాబ్దాలు అడుగడుగునా పోరాడివారు ఓటుహక్కు మరికొన్ని హక్కులు పొందగలిగారు. అమెరికన్ స్త్రీలు నర్సులుగాను, టీచర్లుగాను, టెక్నీషియన్లు సెక్రెటరీలేగాని సెనేట్‌లో, రాజకీయాది కీలకస్థానాలన్నీ పురుష పరంగావుంటాయి. 1917 రష్యన్‌విప్లవానికి పూర్వం జారుప్రభుత్వంలో స్త్రీలఅగచాట్లు వర్ణనాతీతం. ఈనాటికీ కొన్నిదేశాల శాసనసభల్లో స్త్రీలే లేరు. సిరియా, పాకిస్తాన్ ఇథియోపియా, ఈజిప్టు, కంబోడియా దేశాల్లో

స్త్రీలు ఎన్నికవటమే దుర్లభం, డిప్లమాటిక్ సర్వీసుల్లో స్త్రీలను పరిత్యజించే దేశాలనేకం. అసలు విద్యలేని, బ్యాంకు అంకౌంట్లు లేని స్త్రీలున్నదేశాలింకా వున్నాయి. మసీదుల్లోకి స్త్రీలు రాకూడదని, ప్రార్థనల్లో పురుషులతో కలసి పాల్గొనరాదని, శరీరంనిండా నల్లబురఖావేసుకొని ( భర్తతోమాత్రమే ) బైటికిరావచ్చని ముస్లిం స్త్రీలకు ఆంక్షలున్నాయి. నలుగురు భార్యలుండ వచ్చనే సంప్రదాయం ముసల్మానుల కింకా అమల్లోవుంది. అంగాంగ ప్రదర్శనలిచ్చే హాకీలాంటి ఆటల్లో స్త్రీలకు ప్రవేశార్హతలేదు. అదికాక ఈ మధ్య ముస్లింమహిళలు సినిమాలు చూడరాదనే ఫర్మానాలు జారీచేయ బడ్డాయి. ఉల్లంఘించినవార్ని చిత్రహింసలుపెట్టినట్లు వార్తలొచ్చినాయి. ఆడవాళ్ళు దెబ్బలు తినటం ప్రపంచమంతటావుంది. సమానత్వం ఏ దేశంలో నూలేదు. స్త్రీ కూడా ఒకవ్యక్తి అనిగుర్తించని దేశాలు కోకోల్లలు. అవి సాంస్కృతికంగా మధ్యయుగంలోవున్నట్లే. మనదేశం ఈ కోవకుచెందిందే.

ఈ దేశంలో స్త్రీ స్థానం పాదాలచెంతనే. బాలికకు శైశవం దాటగానే "మెల్లిగా మాట్లాడాలి; తలెత్తుకొని తిరగరాదు; నిటారుగా నిలబడ రాదు; భర్తకు అణిగి, మణిగివుంటూ మాకు కీర్తి ప్రతిష్టలుతేవాలి" అని శిక్షణ ఇస్తారు. ఆ హద్దు దాటిన స్త్రీకి పుట్టింటా, మెట్టినింటా చోటువుండదు. అసలు ఆడపిల్లపుడితేదుఃఖపడి ఆ బిడ్డను హత్యచేసే జాతులింకా ఈదేశంలో వున్నాయి. ఒకానొక సామాజికదశలో మాతృస్వామిక వ్యవస్థవుండేదని చరిత్రకారులు తేల్చారు. కాని ఏకాలంలో, ఏదేశంలో, ఏరాజ్యంలో ఏజాతిలో, ఏమతంలో కాని స్త్రీ పురుషుడితో సమానహోదా అనుభవించినట్లు రికార్డయిన ఆధారాలులేవు. ఎక్కడో ఒక జంట తప్ప పురుషుడే అధికుడన్న ఆధారాలు అసంఖ్యాకం.

వేదకాలంలో గార్గి, మైత్రేయిలాంటి పండితురాండ్రు వుండేవారని గర్వపడతాం. కాని వేదాలు చూచినా, నాటి సంఘవ్యవస్థచూచినా స్త్రీకి ప్రత్యేక విశిష్టతఏమీ కన్పించదు. గర్భస్థశిశువు మగబిడ్డకావాలని ప్రార్థించి నట్లు ఆధారాలువున్నాయి. అసలు వేదప్రవచనం చేసిన ఋషులలో ఏవక్క స్త్రీలేదు. పైగా స్త్రీలు వేదం చదువరాదనే ఆంక్షకూడావుంది. ఇలా పెరుగుతూవచ్చిందే భారతనారీ సంప్రదాయం; ఇదే మన సంస్కృతి.

" ఎక్కడ స్త్రీ గౌరవించబడదో అక్కడ శుఖశాంతులుండ " వనే మరోచిలక పలుకుంది. మనదొక చిత్రవిచిత్రమైన సంస్కృతి. స్త్రీ జనాభ్యుదయమే సమాజానికి గీటురాయి అంటారు పైకి. స్త్రీ పురుష లిద్దరూ కలిసి తిరిగితేనే నిజమైన స్వేచ్ఛ, సమానత్వం అంటారు. దానికి భారత స్త్రీ నూరామడల దూరంలో వుంటుంది. అందుకే ఇక్కడ విప్లవం గాఢనిద్ర పోతోంది.

స్త్రీల హోదా అంటే సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో, సామాజిక వ్యవహారాలలో ప్రముఖ పాత్ర వహించడమే. స్త్రీల సామాజిక, ఆర్థిక స్థాయిని పెంచే ప్రయత్నాలు ఈ దేశంలో అత్యల్పంగా జరిగినై. ఉన్న వనరులను సైతం వారు స్వీకరించలేని స్థితికి కారణం అవిద్య, అజ్ఞానం, అసమానత, మూఢ విశ్వాసాలేనని చెప్పక తప్పదు. ఇలా అనేక పరిమితులకు లోనైన స్త్రీలు స్త్రీల సమస్యలను, పరిష్కారమార్గాలను గురించి ఆలోచించరు. తమ ఉనికిని గురించి పట్టించుకోరు. ప్రముఖమైన రాజకీయరంగంలో, శాసన నిర్మాణంలో తమ పాత్రను గురించి విస్మరించుటే విచక్షణకు నిదర్శనం. ఈనాటి 594 పార్లమెంటు మెంబర్లలో 19 మంది మాత్రమే స్త్రీలున్నారంటే రాజకీయ సమస్యలపై తగు నిర్ణయాలు చేయగల సమర్థత వారిలోలేదా? ప్రశ్నించుకోవాలి.

ఇక సాంఘికంగా ఆలోచిస్తే స్త్రీలపై జరిగే అత్యాచారాలకు అంతే లేదు. ఆమెనొక వస్తువుగా భావించి మానభంగాలు చేసేవారు కొందరయితే, వెట్టిచాకిరీ చేయించుకొని తక్కువ వేతనాలిచ్చే వారనేకమంది. ఇక కట్నం తేలేదని కాల్చిచంపే రాక్షసుల కబంధ హస్తాలలో ప్రాణాలు విడిచే అబలలు అనంతంగా వుంటున్నారు. దుష్టుడైనా, క్రూరుడైనా ఆమె అణగి, మణిగి హారతులివ్వాలి, లేదా నల్లిలా నలిపేస్తాడు భర్త. ప్రేమించినవాణ్ణి పెళ్ళాడే యోగ్యతకు నోచుకోని అభాగినులెందరో ఆత్మార్పణంచేసుకోవటం సర్వ సామాన్యం. స్త్రీ విడాకులు పొందితే ఆమెను వివాహమాడే పురుషులు లేరనే చెప్పొచ్చు. బాల వితంతువైనా వివాహానికి నోచుకోనీయని దౌర్భాగ్యులున్న కుత్రిమ సమాజం మనది. వారు జీవచ్ఛవాల్లా బ్రతకాలి. వికృతమైన రూపంతో జీవించాలి ఇలా అనేకవిధాల బాధితులై, ప్రాణావశిష్టులై వువచ్ఛావాల్లా బ్రతికే స్త్రీలు కోట్లసంఖ్యలో ఈదేశంలోనే కాదు దేశదేశాలలో జీన్నారనేది నగ్నసత్యం.

కారణాలేమయినాకాని స్త్రీ బానిసయి కట్టుబడి పోవటం జరిగిన విషయం. దానినుండి విముక్తి పొందటం జరగాల్సినపని. ఇది అతి క్లిష్ట మైన సమస్య. సంప్రదాయాన్ని ఛేదించటం ఎంతకష్టమో ఆధునికతను స్థాపించటం అంతకన్నా కష్టం. కాని ఎప్పుడో ఎక్కడో అది ప్రారంభించక తప్పదుగదా! దానికి కొన్ని మౌలికమైన మార్పులు రావాలి. అంటే సామాజిక విలువల్లోనే మార్పులు తేవాలి. మేధా సంపత్తిలో, మానసిక ప్రవృత్తిలో స్త్రీ పురుష భేదాలు లేవని స్త్రీ పురుషులు మున్ముందుగా నమ్మాలి. అసలు చైతన్యవంతమైన స్త్రీ తమ ఆధీనంలో వుండాలనడం సామాజిక దోపిడిగా పురుషులు భావించిననాడే మహిళాభ్యుదయానికి నాంది ఏర్పడుతుంది. స్త్రీలు సైతం మున్ముందు తమ సమస్యల్ని గుర్తించాలి. తమలో మానసిక విప్లవంరావాలి. మూఢాచారాలపై తిరుగుబాటు చెయ్యాలి. ఆర్థిక భద్రతకై పాటుపడాలి. తమలో సాంఘిక, రాజకీయ పరిజ్ఞానం పెంపొందించుకోవాలి అక్షరాస్యత, విద్య, ఉపాధి శిక్షణాఅవకాశాల్లో స్త్రీ పురుష వివక్షత నేరంగా, సామాజిక విద్రోహంగా పరిగణించాలి. చిత్తశుద్ధి, నిస్వార్ధచింతన, సేవా దృక్పథం, సంస్కరణాభిలాషగల స్త్రీలు అత్యధిక సంఖ్యలో ముందుకు రావాలి. తాత్వికచింతన, తార్కికదృష్టి, ప్రజాస్వామిక విలువలపై విశ్వాసమున్న స్త్రీలు స్త్రీల సంఘాలను స్థాపించి మానవ విలువలపై మగు వలకు ఆసక్తిని కల్గించాలి. నిజాయితీగల స్త్రీల నాయకత్వంలో స్త్రీ విమో చనోద్యమాలు పురోగమించగలవు. స్త్రీలంతా సంఘటితమై సంఘాలను నిర్మించుకొని అవసరమైతే తిరుగుబాటు ద్వారానైనా తమ వ్యక్తిత్వాన్ని, హక్కులను నిల్పుకొన్ననాడే సామాజిక ప్రగతి వుంటుంది.

ప్రతి సంస్కరణ అభివృద్ధీ స్త్రీ జీవితంతో ముడిపడి వుంటుందని ముందుగా పురుషులు గ్రహించాలి. స్త్రీకి సమాన గౌరవం, అవకాశంలేని స్థితిని పురుషులు తమకు అవమానంగా భావించిననాడే సామాజిక మార్పు తథ్యమనే విషయంపురుషుల గ్రహించిననాడేమార్పులుశరవేగంగా రాగలవు.

ఏది ఏమయినా స్త్రీలు గత చరిత్రను నెమరువేసుకొని, వర్త మానాన్ని తిలకిస్తూ భవిష్యత్తుకై పరితపించాలి. దానికి స్త్రీలు తమ అస్థి త్వాన్ని తెలుసుకుంటే చాలదు. దానికి ఒక గొంతుచాలదు.

# మత సంస్కృతిలో మహిళ

భారతదేశం పతివ్రతలకు పుట్టినిల్లు. 'సీతా, సావిత్రి, ద్రౌపతి, చంద్రమతులు ఈ గడ్డపైనేపుట్టి భారతీయ సంస్కృతికి మంచివన్నె తెచ్చారు; వారు గొప్పపేరు ప్రఖ్యాతులు గడించారు' అని పొగుడుతారు సనాతనులు. అనాదినుండి భారత మహిళలకు మాతృమూర్తి అనే బిరుదిచ్చి, సంతానమనే లంకె తగిలించి, పతివ్రత అనే ముళ్ళ కిరీటాన్ని నెత్తినపెట్టి ఆమెను నాలుగు గోడలమధ్య కట్టిపడేసింది మతం. మన సంస్కృతికి ఉన్న అనేకజాడ్యాలలో పాతివ్రత్యం ఒకటి. ఒకపురుషుడికి స్త్రీనిఎన్నివిధాల లొంగదీయడానికి అవకాశమున్నదో అన్ని విధాలైన రూపాంతరాలలో ఆమెను నిబద్ధంచేసి ఆ సూత్రాలు అమలు జరపటానికి ప్రయత్నించారు అర్యరుషులు. స్త్రీకి స్వేచ్ఛ అన్నపదానికిగాని, వ్యక్తిత్వం అన్నమాటకు గాని అర్థం తెలియని రీతిలో మలిచింది మతం. రత్నహారాలు, అందెలు, కంకణాలు, దండ కడియాలులాంటి ఏడువారాల సొమ్ములిచ్చి మహిళను మచ్చిక చేశారు. అవి చూసుకొని మురిసిపోతోంది నాటి మహిళ, నేటిమహిళ కూడా. ఒకనాడు స్త్రీ స్వేచ్ఛను అరికట్టి. బంధించటానికి సమాజం తగిలించిన ఆ బంగారు సంకెళ్ళు ఈ నాటికీ విడివడనిరీతిలో బిగిసి ఆమెను బంధించి వుంచినై. ఈనాడు ఆ సంకెళ్ళు తెంపినా పారిపోని ఖైదీలుగా మలచ బడ్డారు మన పతివ్రతలు. సాంఘికంగా, ఆర్థికంగా, నైతికంగా అణగి మణిగి వుండటానికి మహిళకు ఎన్ని కట్టుబాట్లకు అవకాశమున్నదో అన్నివిధాలా తరతరాలుగా మారని రీతిలో ఆమె 'బ్రెయిన్‌వాష్' చెయ్యబడ్డది.

ఏదేశమైనా, ఏమతమైనా, ఏనాడూ స్త్రీకి సమానహోదా, తాహతు ఇవ్వలేదు. వేదాలు చదివినా నాటి వ్యవస్థ చూచినా స్త్రీకి ప్రత్యేక విశిష్టత వున్నట్లు కన్పించదు. మత దృష్టిలో "సమాజం" అంటే పురుషులేనని, వారి ఆవసరాలు తీర్చేయంత్రాలు మాత్రమే స్త్రీలు అని స్పష్టీకరించారు. స్త్రీని శృంగార సాధనంగా, పిల్లల్నికనే యంత్రంగా, గొడ్డుచాకిరిచేసే బానిసగా తయారుచేశాయి మతాచారాలు. అసలు మత ఆవిర్భావంలోనే కర్మ అని, తలరాత అని, దైవనిర్ణయమనే ప్రవచనాలు వున్నాయి. అందులో స్త్రీకి

అనేక ఆంక్షలు, కట్టుబాట్లు, కఠిన నియమాలు నిర్దేశింపబడ్డాయి. మతం స్త్రీ స్థానాన్ని పురుషుడి పాదాల చెంతనే వుంచింది. శైశవం దాటగానే మెల్లిగా మాట్లాడాలని, తలెత్తుకొని తిరగరాదని, నిటారుగా నిలబడరాదని శాసించింది. "స్త్రీ ఎప్పుడూ భర్తకు వినయ విధేయతలతో లొంగివుండాలి. భర్తముందు వాచా పాత్రిఖల్యం పనికిరాదు. మగడు కోపించినా అలుగరాదు. భర్త సంతోషిస్తే తానూ సంతోషించాలి. భర్త దుఃఖిస్తే తానూదుఃఖించాలి ఏకాంతవేళల్లో మనస్సులో దుఃఖమున్నా దాచుకొని భర్తముందు నవ్వుతూ, అయన్ను పొగడుతూ వుండాలి'' కాశీఖండంలో చెప్పారు.

"స్త్రీలు నరకానికి సింహద్వారంవంటివారు" అన్నాడు శంకరాచార్యుడు. ఆడది పాపగర్భంనుండి జన్మించింది అంటుంది భగవద్గీత-"న స్త్రీస్వాతంత్ర్య మర్హతి'' అంటూ ఆడదానికి ఆ జన్మాంతం సంరక్షకత్వం ప్రతిపాదించింది మనుస్మృతి. స్త్రీని బానిసత్వానికి చిహ్నంగా, ఆటబొమ్మగా మార్చేశాయి ధర్మశాస్త్రాలు. అంతేకాదు భర్త క్రూరుడైనా, కొట్టినా, తిట్టినా, చంపినా అమగణ్ణే ప్రత్యక్ష దైవంలా పూజించాలని నిర్వచించింది హిందూమతం. ఇస్లాంస్త్రీలను జంతువులతో పోల్చింది. స్త్రీని దున్నేపొలంగా పేర్కొంటూ దానిపై సర్వాధికారాలు దున్నేవాడివేనంటూ కొరాన్ చెప్పింది. "స్త్రీ మీద పురుషుడికి సర్వాధికారాలు వున్నాయి. 'అల్లా' పురుషుణ్ణి అధికుణ్ణిగా సృష్టించాడు. ఆమె పోషణకోసం అతను తన సంపదను వెచ్చిస్తున్నాడు కనుక, ఆమె విధేయత చూపాలి. అవిధేయురాలిని నీ పడక మీదికి రానీయకు, కొట్టు. ఆమె మారితే ఇక ఏచర్య తీసుకోకు'' (కొరాన్ 4 : 34 ఉవాచ)

స్త్రీని పాపాలకు మూలకారణమైన "ఈవ్"గా పేర్కొన్నది క్రైస్తవం క్రిస్టియన్ల పెళ్ళిలో స్త్రీ చేత మాత్రం "నీకు విధేయతచూపుతా (Love & Obey) అనీ; పురుషుడి చేత" నిన్ను రక్షిస్తాను (Cherish & Protect)'' అని ప్రమాణాలు చేయిస్తారు. పురుషుణ్ణి ముందు సృష్టించి, అతని సంతోషం కోసమే స్త్రీని దేవుడు సృష్టించాడని ప్రచారం చేస్తోంది బైబిలు. అసలు పురుష పతనానికి మూలకారణం ఆడదే (ఈవ్) అని ఊసడిస్తుంది.

మతసంస్కర్తలలో ముఖ్యుడైన బుద్ధుడుసైతం మొదట్లో భిక్షుణీలుగా స్త్రీలను స్వీకరించనన్నాడు. సర్వసంగ పరిత్యాగం చేయగలమని, తమకు మోక్షార్హతకావాలని తల్లిగౌతమి వాదించిన తర్వాతే ఆ అవకాశమిచ్చాడు వారికి బౌద్ధ సన్యాసినులుగా. ''ముక్తికి, మోక్షానికి స్త్రీ అనర్హురాలు'' అని జైన మతం ప్రతిపాదించింది. ఆమెకు ముక్తికావాలంటే మరోజన్మలో పురుషుడుగా పుట్టాలని జైన మత ప్రవక్త మహావీరుడన్నాడు. స్త్రీలకు గృహ సంబంధమైన విద్యచాలని రూసో అన్నాడు, ప్లేథన్ అంతటివాడు స్త్రీ మేధాశక్తి, నైతిక విలువలు పురుషునిలో 3/4 వంతుఅన్నాడు.

''స్త్రీలకు పురుషులకన్నా పళ్ళు తక్కువ వుంటాయి. అంతేకాక ఆమెకు స్వేచ్ఛనిస్తే ఈ లోకాన్నే దిగమింగుతుంది'' అన్నాడు విష పానీయాన్ని సేవిస్తూ గ్రీకు తత్వవేత్త సోక్రటీసు. బహుశా తన భార్య పరమ గయ్యాళి కనుక అలాంటి సందేశమిచ్చివుండవచ్చు- '' సిల్లీ ఉమన్ '' అన్నాడు సెయింట్ పాల్. ఆడది మగవాని కొరకు సృష్టింపబడ్డది కాని పురుషుడు మాత్రం స్త్రీ కొరకు సృష్టింపబడలేదని ప్రతి మతం పేర్కొన్నది. స్త్రీలు తమకు తెలియని విషయాలను భర్తలద్వారా మాత్రమే తెలుసుకొని వారి ఆజ్ఞలను జవదాటరాదని నిర్దేశించారు. అలా మత గ్రంథాలన్నీ పురుషాధిక్యతను వేయినోళ్ళ చాటాయి.

లండన్ చర్చిలో ఆడవాళ్ళకు ఆత్మలు లేవని, వాళ్ళ మెదడుచాలా చిన్నదిగా వుంటుందని చర్చలు జరిపారట. భార్య చేసే కొన్ని అపరాధాలకు, పాపాలకు శిక్షలేదనీ -ఎందుకంటే భార్యకుప్రత్యేక అస్తిత్వం లేదట-బ్రిటిష్ న్యాయస్థానంలో భావించేవారు.అంటే భార్య భర్తఅదుపు ఆజ్ఞలనుజవదాటదు కనుక, ఆమెను భర్త బానిసగా పరిగణించారు. ఇది బ్రిటిష్ సమాజంలో స్త్రీ యెడగల న్యూనతా భావానికి నిదర్శనం. ఇంకా చర్చిలో స్త్రీని నోరు మూసుకుని, నెత్తిన ముసుగేసుకుని కూర్చోమని ఆజ్ఞాపించారు ' ఆర్చి బిషప్పులు''. అసలు ఏ మతంలోనూ స్త్రీకి ఆచార్యకత్వంలేదు; పూజారిణిగా అసలే అనర్హురాలు. ఇస్లాం వివాహంలో 'నికా' రిజిష్టరులో వరుడు సంతకం పెట్టాలి. వధువు తరపున వకీలు పెడితేచాలు అది చెల్లుతుంది. ముస్లిం పురుషుడు ఏకకాలంలో నలుగురు భార్యలను వివాహ మాడవచ్చు. ఆమె ఆపాదమస్తకం ముసుగు ధరించి తిరగాలి.

చాణుక్యనీతి దర్పణంలో స్త్రీలు నిజాయితీలేనివారని, నీతిహీనులని రాసిఉంది. స్త్రీ ఆజన్మాంతం ఎలా అదుపు, ఆజ్ఞల్లో జీవించాలో కుమారీ శతకం లాంటివి రాయించి వివరంగా బోధించారు హిందూమతస్తులు. ఇలా అన్నిమతాలు స్త్రీని అణగద్రొక్కాయి. ఆమె పురుషుని భోగ్యవస్తువని, పిల్లల్ని కని వంశాన్ని వృద్ధిచేయటానికే సృష్టింపబడ్డదని మత గ్రంథాలన్నీ ధృవీకరించాయి. పాకశాస్త్రం, లలిత కళలు తప్ప మరే విద్యకు స్త్రీలు అనర్హులని నిన్నమొన్నటిదాకా ఆమాటకువస్తే ఇప్పటికీ భావించేవారు కోకొల్లలుగా వున్నారు.

స్త్రీ కూడా మనుషేనని, ఆమెకు స్వేచ్ఛా, వ్యక్తిత్వం వుండాలని ఏమతమూ, ఏనాడూ బోధించలేదు. అందువల్లనే పురాణయుగం నాటి పాతివ్రత్యాన్ని, నోములు, వ్రతాలు, పూజలు లాంటి మతపరమైన క్రతువులను స్త్రీలింకా పాటిస్తున్నారు. వారు ఏదో ఒక మతంలో నమ్మిక కలిగి వుంటారు. వారి కాలమంతా ప్రార్థనలకు, పురాణ శ్రవణాలకు, పూజలకు నోములకు, వ్రతాలకు వినియోగిస్తారు. ఇది తరతరాలుగా జరిగిన మత పరిణామ చరిత్ర. ఏది ఎలా జరిగినా మతవాదుల విజృంభణ మహిళను బలిచేసింది. రెండవ తరగతి మనిషిగా మార్చింది. బానిసగా ఆమెను సంకెళ్ళతో బిగించింది. ఇది జరిగిపోయిన విషయం. ఇప్పుడు జరగాల్సింది ఆ సంకెళ్ళనుండి ఆమెకు విముక్తి; తద్వారా సమాజ ప్రగతి. ఇది దుస్సాధ్యంకాక పోయినా, చాలా చిక్కు సమస్య. తరతరాలుగా మన రక్తంలో జీర్ణించిన బానిస ప్రవృత్తి అంత తేలిగ్గా మార్పుచెందదు.

సంప్రదాయాన్ని పారద్రోలటం ఎంత కష్టమో ఆధునికతను ప్రవేశ పెట్టటం అంతకన్నా కష్టం. అయినా మార్పులేనిదే ప్రగతిలేదు. ఎంతకాలం స్త్రీ అజ్ఞానంలో వుంటుందో, దరిద్రంలో వుంటుందో, వ్యక్తిత్వాన్ని చంపుకుంటుందో, దాస్యంలో మ్రగ్గుతుందో అంతకాలం సాంప్రదాయ శక్తుల బలప్రదర్శనం ఆమెపై విజృంభిస్తూనే వుంటుంది.

స్త్రీల కన్నీళ్ళకూ, ప్రార్థనలకూ, ఆత్మహత్యలకూ మత దుర్నీతి నశించదు; రాక్షస మనస్తత్వాలు కరగవు. విషసంస్కృతి సమసిపోదు; రాకాసి వ్యవస్థమార్పుచెందదు. ఎవరోవచ్చి బాధితుల్ని రక్షిస్తారనుకొనుట భ్రమ. కనుక ముందుగా నిర్ప్రాణమైన స్త్రీ జాతి మేల్కొని ఆత్మస్థైర్యంతో తమ స్థాయిని, హోదాను, గౌరవాన్ని నిలుపుకోవాలి. స్త్రీలు గానే కాకుండా సమాజంలో చైతన్యంకల వ్యక్తులుగా సంచరించాలి. దానికై స్త్రీలలో మార్పురావాలి.

)o(—)o(

# మ హి ళా భ్యు ద య ము

మహిళాభ్యుదయం, లేక మహిళోద్యమం అంటే పురుషులపై తిరుగుబాటని, పురుషజాతి విధ్వంసమని, అదేదో దేశానికి ప్రళయం తెస్తుందని వితండవాదం చేస్తారు. స్త్రీ స్వేచ్ఛ, సమానత్వం అంటే అది విచ్చలవిడి ప్రవర్తన అని కొందరంటే ఇల్లూ, పిల్లల్నీ విడిచేసి స్వైరవిహారం చేస్తారని మరికొందరూ ఆక్షేపిస్తున్నారు. సంసారపు బాధ్యతల్ని కాలదన్ని గంగిరెద్దులా తిరుగుతారని ఇష్టంవచ్చినట్లు విమర్శిస్తారు సనాతన తిరోగమన వాదులు. వారికి అసలు విషయం తెలియకకాదు. ఇష్టంలేని విషయానికి, వారు వింత వ్యాఖ్యానంచేస్తూ కథలు చెప్పగలరు. స్త్రీ వ్యక్తిత్వాన్ని గుర్తించదలచుకోని గ్రుడ్డివాళ్ళు గుడ్డికళ్ళతో చూస్తారు. పచ్చకామెర్ల వాళ్ళకు లోకమంతా పచ్చగా వున్నట్లు గోచరిస్తుంది. తరతరాల బానిసత్వానికి సంకెళ్ళకూ అలవాటుపడ్డ మహిళలు, పురుషుణ్ణి దైవంగా ఆరాధించే స్త్రీలు విముక్తికై పోరాడితే తమపలుకుబడి తగ్గుతుందని, వారి వ్యక్తిత్వం వికసిస్తే తమ నీతిబోధలు వినరని, తమకు శుశ్రూషచెయ్యరని, భయభక్తులతో మెలగరని భర్తలకు భయం ఆవహిస్తున్నది. అందుకే తిరుగుబాటంటే వాళ్ళకు 'హడల్'వాళ్ళ గుండెల్లో రైళ్ళు పరిగెడతాయి; మనస్సులలో గాలం పడుతోంది. ఇది బైటికి చెప్పుకోలేక 'మీకేమయింది! బాగానేచూస్తున్నాంగా?' అంటూ కప్పదాటేస్తారు. ఒకవర్గపు ప్రజానీకం ఏదితప్పో, ఏదిన్యాయమో వారి అంతరాత్మకు తెలుసు. తెలిసి చేస్తే అది ఆత్మవంచన అవుతుంది.

మహిళాభ్యుదయమంటే కేవలం మహిళల అభివృద్ధేనని, అది సమాజానికి గాని, పురుషులకుగాని, కుటుంబానికిగాని సంబంధించిన సమస్యకాదనే భావం మరోవర్గం వారిలోవుంది. అసలు సమాజంలో సమూలమైనమార్పువస్తే మిగతా సమస్యలతో పాటు స్త్రీల సమస్యలుకూడా సమసిపోయి సరిక్రొత్త సమాజ అవిర్భావం జరుగుతుందనేభావం కొందరిలో వుండబట్టే మ హి ళా భ్యుదయ ప్రాముఖ్యత, మహిళల ప్రగతి విస్మరించబడుతోంది; తద్వారా సమాజం నష్టపడుతోంది. మానవదేహానికి శిరస్సూ, మొండెమూ రెండూ ఎంతప్రాముఖ్యమో సమాజ ప్రగతికీ, దేశాభ్యున్నతికీ పురుషులతో పాటు

స్త్రీలుకూడా అంత జీవగర్రలని మహిళాభ్యుదయానికి ప్రత్యేక పాత్రవుందని భావించిన నాడు పురుషాధిపత్యమూ నశిస్తుంది. మహిళల సమస్యలూ సమసిపోతాయి. అసలు వ్యాధి గురించిన అవగాహనలేనందువల్లే మన ప్రయత్నాలన్నీ మట్టిపాలవుతున్నాయి. ఇంతవరకు స్త్రీని వేరుగా, ఆట బొమ్మగా, సెక్సు 'సింబల్' గా పరిగణించబట్టె మన పధకాలు తగిన ఫలితాన్ని ఇవ్వడంలేదు. ఇంతవరకూ మహిళాభ్యుదయానికి జరిపినకృషి వుందా? ఏ పరిధిలో జరిగింది? ప్రభుత్వ పధకాలేమిటి? ప్రజాసంఘాల పాత్ర ఏమిటి? వీటినిగురించి ఆలోచిద్దాం.

స్వాతంత్ర్యానికి పూర్వం స్త్రీల నిస్సహాయస్థితిని, అవమాన పరిస్థితిని గుర్తించినవారు లేకపోలేదు. అయినా స్త్రీల అభ్యున్నతికి ఆర్ధిక తోడ్పాటుకు రాజకీయ అభినివేశానికి, సామాజికాభివృద్ధికి పాటుపడినవారు అత్యల్పం. ఆనాడు మహిళాభ్యుదయానికి కృషిజరుగకపోలేదు. స్త్రీలకు విద్యావకాశాలు, ఆస్తిహక్కు, వివాహవయస్సు, పెంపుదల, పతిత జనోద్ధరణలాంటి సంస్కరణలు బహుకొద్దిగా జరిగాయి.నాటి సమస్యలూ వేరు, లక్ష్యాలూ వేరు. తదుపరి మహిళాభ్యుదయం నత్తనడక నడిచింది. కొన్ని సంఘాలు కేవలం వంటలకు, కుట్టుపనులకు, భజనలకు, 'ఫ్యాషన్ పెరేడ్'లకు దేశాటనలకే పరిమితమయ్యాయి. కొన్ని సంఘాలు అధికధరలు, అత్యాచారాలు, కత్తీలు, అవినీతి లాంటివాటికి నిరసనలు తెలిపాయి.

రామ్‌మోహనరాయ్, గురజాడ, కందుకూరి, విద్యాసాగర్, ఎం. ఎన్. రాయ్ లాంటి మేధావులు, కొంత కృషిచేశారు; కొన్నిమార్పులు తెచ్చారు. దేశంలో పెద్ద రాజకీయ పార్టీలవారు మహిళా సంఘాలను కూడా పార్టీ అనుబంధ సంస్థలుగా **(Front organizations)** స్థాపించారు. కాని అసలు స్త్రీ స్వేచ్ఛా సమానత్వాలకై వారి ప్రతిపత్తికై ఏకకంఠంతో, ఐక్యతగా కొన్ని లక్ష్యాలకై పోరాటమనేది మనదేశ చరిత్రలోనే జరగలేదు.

1971 లో ఫూల్‌రేణుగుహ అధ్వర్యాన స్త్రీల స్టేటస్ కమిటీ **(Committee on Status of Women in India)**ని నియమించి భారత స్త్రీల హోదాను పరిశోధించమని అడిగింది భారత ప్రభుత్వం.

వారిపరిశోధనకు మూడు సంవత్సరాల కాలము పట్టింది.తొమ్మిదిలక్షల యాభై వేల రూపాయలు ఖర్చు అయింది. "దేశ స్వాతంత్ర్యానంతరం భారత స్త్రీలకు చట్టరూపంలో కొన్ని హక్కులు వచ్చాయి. వాటికి రాజ్యాంగం హామీ (**Guarantee**) ఇచ్చింది. అయినప్పటికీ స్త్రీలు ఆ హక్కులను అనుభవించలేదని మా సర్వేలో తేలినముఖ్య విషయం" అని రాశారు. ఇది వారు తమ 'రిపోర్టు'లో ఇచ్చిన సారాంశము.

ఈ 'భారత స్త్రీల స్థాయి జాతీయ కమిటీ' అంతర్జాతీయ మహిళా సంవత్సరంలోనే ఒక నివేదికను తయారుచేసి ఆ రిపోర్టును ప్రభుత్వానికి అందజేశారు. భారత స్త్రీల హోదాను పెంచటానికి అనువయిన సూచనలు ఎన్నో ఈ నివేదికలో వున్నాయి. వారు 1975 లో సమర్పించిన నివేదికలో 36 సిఫారసులు వున్నాయి. స్త్రీలలో నిరక్షరాస్యత అధికం కావటంవల్ల తమ హక్కుల విలువకాని, ఆ హక్కులను అమలు పరచటం యొక్క అవసరం కాని, వాటిని రక్షించుకోవలసిన బాధ్యతగాని తెలుసుకోలేని అజ్ఞానదశలో మహిళలు వున్నారని ఆ కమిటీవారు ఆవేదన పడ్డారు. ఈ పరిస్థితిని మార్చవలసిన బాధ్యత ప్రభుత్వానిదేనని వారు హెచ్చరించారు. స్త్రీ విద్యపై విముఖతవల్ల రెండువందల తొంభైమిలియన్ల స్త్రీశక్తి నిరుపయోగమవుతోందని, ఇలాగే కొనసాగితే ఈ నిరుపయోగ ప్రమాదం మరింత క్లిష్టమై దేశ భవిష్యత్తునే తారుమారు చేస్తుందని ఈ స్త్రీల ప్రతిపత్తి సంఘంవారు తమ నివేదికలో ముఖ్యాంశంగా పేర్కొన్నారు. ఏరెండో తప్ప వారి సిఫారసులు మనం పట్టించుకోలేదు ఈ నాటికీ.

ఈ స్త్రీలహోదా కమిటీ తమ రెండవ ముఖ్యాంశంలో స్త్రీలు వెనుకబడినతనంవల్ల సంఘపురోభివృద్ధే నశిస్తుందని,తద్వారా కుటుంబం విచ్ఛిత్తి అయ్యే ప్రమాదం లేకపోలేదని తెలియజెప్పారు. స్త్రీ పురుషుల మధ్యతేడాను అఖాతాన్ని తొలగించాల్సిన బాధ్యత ప్రభుత్వానిదేనని, ఆ విషయాన్ని విస్మరిస్తే దేశాభ్యుదయానికే అరిష్టం వాటిల్లుతుందని నిర్మొగమోటంగా ఆ కమిటీవారు తమ నివేదికలో పొందుపరిచారు.

స్త్రీ పురుషవివక్షతను కేవలం చట్టాలుకాని, ఆర్డినెన్సులు కాని తొలగించలేవు. ఈనాడు స్త్రీలయెడ సామాజిక దృక్పథంలో మార్పు రా వా లి; పురుషుల ప్రవర్తనలో మార్పు అనివార్యం కావాలి. ఎలిమెంటరీ విద్యనుండి డిగ్రీల వరకు బాలబాలికలు ముఖ్యంగా కలిసి చదువుకోవాలి. వారి విద్యా ప్రమాణాలలో మార్పుతేవాలి. వృత్తివిద్యల్లో, పారిశ్రామిక రంగంలో ఇతర శిక్షణారంగాల్లో 50% స్త్రీలకు అవకాశమివ్వాలి. కులం మతాతీత వివాహాలకు సమాజపరంగా స్థాయిని పెంచాలి. ముస్లిం న్యాయచట్టాలను సవరించాలి; వారిలోని బహుభార్యాత్వాన్ని తొలగించాలి. ఇప్పటి వరకు అమల్లోవున్న ఏకపక్షంగా విడాకులు పొందగలిగే హక్కును సవరించాలి. ఇద్దరు కలిసి చేసిన వ్యభిచారంలో స్త్రీని మాత్రమే దోషినిచేసి శిక్షించే పక్షపాత దుర్నీతిని శిక్షాస్మృతినుండి తొలగించాలని ఇలాంటివి చాలాముఖ్యమైనవి, అవసరమైనవి, ఆచరణయోగ్యమైనవి ఆ కమిటీ రిపోర్టులో పొందుపరచినందుకు నిజంగా స్త్రీలోకం వారికి కృతజ్ఞులై వుండాలి. "ఇందులో ఎన్ని సూచనలు ఆచరణలో చేశాము? ఎన్ని చెయ్యబోతున్నాం" అనేది మ॥ స్త్రీల మీద, మగవారిమీద, మన ప్రభుత్వంమీద ఆధారపడివుంటుంది. 'దానికి తగిన సంస్కారం, ముందుచూపు మనలో వున్నాయా? లేవా?' అనేవి మన ఆసక్తినిబట్టి వుంటుంది.

మహిళాభ్యుదయం గురించి సభలు, మహాసభలు, చర్చలు, సెమినార్లు, ప్రభుత్వంవారు, ప్రజాసంఘాలవారూ జరుపుతూనే వున్నారు. కాని ప్రగతిమాత్రం గొఱ్ఱతోకలావుంది. కారణం, ఈ కార్యక్రమాలు ఒక 'రొటీన్‌వర్కు‌గా' ఆమాటకొస్తే ఒక 'ఫ్యాషన్'గా తయారయింది. దానికి నిర్దుష్టమైన రూపురేఖలు, చొరవ, ఆసక్తి, పట్టుదల లోపిస్తున్నాయి. మనలో వున్న భావదాస్యం, నిస్తబ్ధత, అసమర్థతలే కారణాలు అని మనం ఆత్మవిమర్శచేసుకోవాలి. తిరిగి ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని, ఉద్వేగాన్ని తెచ్చుకొని కార్యరంగంలోకి దిగాలి.

మహిళాభ్యుదయం అభ్యుదయం అంటూ అరిస్తే అభ్యుదయంరాదు. శాసనాలు అమలు పర్చటంద్వారా, ప్రభుత్వ చర్యలద్వారా, ప్రజాభిప్రాయం ద్వారా మూడువిధాలా కలిసి పనిచేస్తేనే అభ్యుదయాన్ని సాధించగలం.

ఉపన్యాసాలతో, వాగ్దానాలతో స్త్రీలు తృప్తిపడే రోజులు గతించాయి. ఈనాటి మహిళలు ఆర్థిక స్వాతంత్ర్యాన్ని పొంది, సమాజ వ్యవహారాల్లో ప్రధానపాత్రవహించటానికి తగిన అవకాశాలు కావాలని కోరుకుంటున్నారు.

ముందుగా నిరక్షరాస్యతా నిర్మూలన జరగాలి. వివిధవృత్తులలో స్త్రీలకు శిక్షణ, వయోపరిమితిని స్త్రీల విషయంలో అధిగమించి ఉద్యోగా లిచ్చుట, సమానవేతన చట్టాన్ని ఖచ్చితంగా అమలు పర్చడం, ఉపాధి కల్పనలో ఉన్నత స్థానాలలో రాజకీయ సామాజిక ప్రాతినిధ్యంలో నిష్పత్తిప్రకారం స్త్రీలకు ప్రాతినిధ్యమిచ్చుట లాంటి కార్యక్రమాలు అమలు పరచాలి. మతాలనుబట్టి కాక ప్రజలందరికీ వర్తించే వివాహ శాసనం వెంటనే ప్రవేశపెట్టాలి. భార్యాభర్తల తగాదాలను విచారించేందుకు రహస్యంగా కుటుంబన్యాయస్థానాలు పెట్టాలి. వరకట్న నిషేధచట్టాన్ని సమర్థవంతగా అమలు పర్చాలి. అసభ్యంగా చిత్రించే స్త్రీల బొమ్మల ప్రకటనలను నిరసించాలి. స్థానిక సంస్థలలో అసెంబ్లీలలో, పార్లమెంటులో 50 స్థానాలను, స్త్రీలకు విధిగా కేటాయించాలి. భూమిపైనహక్కు, వారసత్వపుహక్కు స్త్రీకి పురుషునితో సమానంగా ఇవ్వాలి. అత్యుత్సాహంతో, పట్టుదలతో స్వచ్ఛందంగా సేవాదృక్పథంతో పనిచేస్తేనే మహిళాభ్యుదయం సాధించగల్గుతాం.

# రచయిత్రులు:

# స్త్రీ పాత్ర చిత్రణ.

ఈనాడు రచయిత్రులు వేల సంఖ్యలో రచనలు చేస్తున్నారు. కాని వారి సాహిత్యంవల్ల సాంఘికంగా స్త్రీల పరిస్థితి మారిందా? రాజకీయంగా స్త్రీలు చైతన్యం పొందగలిగారా? ఆర్థికంగా వారు సమానత్వాన్ని సాధించ గలిగారా? సాంస్కృతికంగా పురోగమించారా? ఎందరిలో శాస్త్రీయదృష్టి కలిగింది? ఆధునికత, అభ్యుదయ భావాలు ఎందరిలో ప్రోదిచేసుకున్నాయి? ఆర్థిక అసమానత్వాన్ని, సామాజిక దోపిడిని వ్యతిరేకించిన వారెందరు? స్త్రీల ప్రతిపత్తికి, స్వావలంబనకు పోరాటాలు నడిపిస్తున్న మహిళలెందరు? స్త్రీలపై అత్యాచారాలకు, స్త్రీ పురుషుల హెచ్చుతగ్గులకు తిరుగుబాటును, అసంతృప్తిని ప్రకటిస్తున్న పాఠకులెందరు? కనీసం సామాజిక స్పృహనైనా మహిళాలోకం పొందగలుగుతొందా? ఇవి రచయిత్రుల రచనలకు, వారి సాహిత్యస్థాయికి గీటురాళ్ళు.

అది కథ, నవల, నాటకం మరేసాహిత్య ప్రక్రియయైనా పాఠకునికి మానసిక జాగృతిని, వికాసాన్ని, సామాజిక నీతిని కలిగించగలిగిందే అసలైన సాహిత్యం. కాలక్షేపానికి, వినోదానికి రచించేది నిజమైన సాహిత్యం అనబడదు. ధనంకోసం పేరు ప్రఖ్యాతులకోసం రచించే సాహిత్యానికి, ఆ రచయిత్రికి చరిత్రలో స్థానంవుండదు. చదువరులలో విజ్ఞానాన్ని చైతన్యాన్ని, శాస్త్రీయదృక్పథాన్ని రేకెత్తించ గలిగిందే సిసలైనసాహిత్యం. సమకాలీన సమస్యలను ఎత్తిచూపి, వాటి మూలానికిపోయి, ఆపరిస్థితికి కారణమేమిటో సూచించి, సమస్యలకు పరిష్కారమార్గాన్ని చూపగల రచయితే అసలైన స్రష్ట. ఈనాటి సాహితీరీతుల్లో అలాంటి రచనలు వస్తున్నాయా అనేదొక శేషప్రశ్నగా మిగిలిపోయింది.

అది క్షుద్రసాహిత్యమైనా, మరే సాహిత్యమైనా తన రచనలవల్ల ఏ ఒక్క వ్యక్తియైనా ప్రభావితం కావచ్చు. కనుక రచయిత్రికి సామాజిక బాధ్యత వుంటుందనే విషయం విస్మరించరాదు. రచయిత్రి తన అభివ్యక్తీకరణకు ముందు తన సందేశాన్ని తాను నమ్మాలి; ఆచరించాలి. ఆతర్వాతే ప్రజలకు ప్రబోధించాలి. అలాంటి నిబద్ధతగల వ్యక్తులే రచానా ప్రక్రియకు అర్హులు. రచయిత్రి స్పష్టమైన భావపరంపరలతో పాత్రలను నడిపించాలే కాని పాత్రలే రచయిత్రులను నడిపిస్తే అలాంటి సాహిత్యం గర్హ్యనీయమవుతుంది. రచయిత్రికి ముఖ్యమయినది చిత్తశుద్ధి; సమస్యలను నిర్లిప్తంగా ఆలోచించగల శక్తి, స్పందన, ఆర్తి, అనుభూతి. అప్పుడే వర్తమాన పరిస్థితులు, స్త్రీల సమస్యలు, సామాజిక దురంతాలు, రాజకీయ అవగాహన రచయిత్రి హృదయంలో చోటుచేసుకుంటాయి. తద్వారా తన అనుభూతులను, అభిరుచులను తన రచనలద్వారా విశ్లేషిస్తుంది. ఉత్తమ రచనకు సూత్రధారి అవుతుంది.

అసలు సాహిత్యమంటే ఏమిటి? అది ఎలా ఉద్భవిస్తుంది? ఎందుకు రచనలు చేస్తారు? ఎన్ని విధాలుగా చేస్తున్నారు? ఉత్తమ సాహిత్యానికి గీటురాయి ఏది? సాహిత్యానికి స్త్రీల సమస్యలకు సంబంధమేమిటి? రచయిత్రులు స్త్రీల పాత్రను ఎలా చిత్రీకరిస్తున్నారు? అనేవి చర్చనీయాంశాలు.

హృదయ స్పందనను వ్యక్త పరిచే ఒక భావాన్ని రచనలో వెలువరిస్తే అది సాహిత్యమవుతుంది. సమాజ ప్రతిబింబమే సాహిత్యమని కొందరి భావం. ఒక సంఘటన చూచిన రచయిత్రి హృదయం ద్రవిస్తుంది. ఆమెకు ఉత్తేజం జనిస్తుంది. ఆమె మనోవీధిలో అనేక భావాలు ఉద్భవిస్తాయి. తన సునిశిత మేధాశక్తితో ఉద్దీపన కలిగించే పాత్రల ద్వారా తన హృదయగత మనోభావాన్ని వ్యక్తీకరించగల రచనాశక్తి కొందరికి మాత్రమే వుంటుంది. అయితే రాసిందంతా సాహిత్యం కాదు. కేవలం నేల విడిచి ఊహాలోకంలో విహరించే సాహిత్యాన్ని సృష్టిస్తారు. కొందరు. సమాజాన్ని వాస్తవిక దృష్టితో చూస్తామంటూ ఉన్నదున్నట్లు చిత్రీకరించేవారు మరి కొందరు. వాస్తవ చిత్రీకరణతో పాటు సమస్యా పరిష్కారాన్ని పాత్రద్వారా సూచిస్తారు కొంతమంది రచయిత్రులు.

'మేము సమాజాన్ని వాస్తవిక దృష్టితో చూస్తాం. సమాజంలోని మంచి, చెడూ రెంటినీ దర్పణం పడతాం, సాహిత్యం ఎప్పుడూ సామాజిక స్థితిగతులను చిత్రిస్తుంది. కాని సమస్యాపూర్వకమైన పరిష్కారం చూపాల్సిన బాధ్యత మాకులేదు.' అంటారు రెండోరకపు సాహితీ పరులు. ఇదొక రకంగా విచిత్రమైనవాదన. పరిష్కారమార్గం చూపకపోవటం అటుంచి, వాస్తవాన్ని చిత్రించడమనేది సాహిత్యంగాను, కళగాను పరిగణించబడదు. వాస్తవ సంఘటనను ఫోటోతీస్తే సరిపోతుందికదా! మనం రోడ్డుమీద ఒక శవాన్ని చూశామనుకోండి. గోపీచంద్ ఎగతాళిచేసినట్లు 'రోడ్డోరోడ్డు, శవమోశవం, చూచాను చూచాను' అన్నామనుకోండి ఏంప్రయోజనం. వాస్తవంపేరుతో సమాజానికి ఫోటోతీస్తే వుపయోగంలేదు. అంటే ఇక్కడ రచయిత్రి సృష్టిగాఏమిచేసింది అనేప్రశ్న ఎదురవుతుంది. ఒక దృశ్యం చూచినప్పుడు ఆమె మనోవీధిలో ఏభావాలు వెలిశాయో, ఆ భావాలకు వున్న పూర్వాపర సందర్భాలేమిటో వివరిస్తే అప్పుడు సమాజాన్ని వాస్తవంగా చిత్రించినట్లవుతుంది. వాస్తవీకరణపేరుతో వున్నదున్నట్లు రాయడంజరుగుతోంది. కాని ఈ రచనా విధానం కూడా అనుసరణీయం కాదని చెప్పవచ్చు.

వాస్తవాన్ని చూపిస్తూనే సమస్య పరిష్కారానికి ఇలా చెయ్యాలని ఒకపాత్ర ద్వారా చెప్పిస్తారు మూడోవర్గపు సాహితీవేత్తలు.ఇక్కడ సమస్యా పరిష్కారం జరుగుతుంది. కాని రచయిత వ్యక్తిత్వం ప్రతిఫలించడంలేదు. రచయిత యొక్క వ్యక్తిత్వం, రచనా పద్ధతిలో, భాషలో, శైలిలో, శయ్యలో, కథా సంవిధానంలో కనపడవచ్చు. కాని అసలు పాత్రలు ఏయే శక్తులకు, ఏయే సామాజిక ధోరణులకు, ఏయే మానసిక వైచిత్రీరూపాలకు సంకేతాలో విశదీకరించడంలేదు. కనుక ఆ రచన అసమగ్రం, అసంపూర్ణం అవుతుంది. అంతేకాక బోధనాపద్ధతి బాహాటంగా కనపడి కళకు అపచారం జరుగుతుంది; రసభంగమవుతుంది. రచయిత్రికి ఉత్తేజం కలిగించే సంఘటనలు ప్రకోపింపజేసేదృశ్యాలు సమాజంలో ఆమెకు గోచరిస్తాయి. ఉద్దీపన కలిగించే పాత్రలు, వ్యక్తులు కూడా ఆమెకు కనపడతారు. అప్పుడామె తనకున్న విశాలదృష్టితో, సునిశితమేధా శక్తితో విశేషానుభవంతో ఆసంఘటనలను ఆదృశ్యాలను విశ్లేషణచేసి వాటి మౌలికాంశాలను గ్రహిస్తుంది.

అప్పుడు వాటికి సంకేతాలుగావున్న పాత్రలచేత కథాసంవిధాన రచనా నైపుణ్యంతో ఒక కావ్యాన్నో, నవలనో, కథనో, కవితనో సృష్టిచేస్తుంది. ఇక్కడ ఒక విషయం జ్ఞప్తిచేసుకోవాలి. ప్రపంచం ఒక రకంగాచూస్తే పూర్తిగా అద్వైతస్థితిలో ఉన్నట్లు కన్పడుతుంది. జీవరాసులలో, అజీవ రాసులలో శక్తి అంతర్భూతంగా వుంటుంది. కనుకనే యదేనియం అణువును బ్రద్దలుకొట్టి కొండలను పిండిచేసి, నదీప్రవాహాలను మళ్ళించి, విద్యుత్‌ను అందించే అణుశక్తిని వెలిదీయగలిగాము. ఈ శక్తి ప్రపంచ మంతటా ఆవరించి ఉంది; ఇది ఏకత్వస్వరూపాన్ని కలిగిఉంది. కాని ఆ ఏకత్వంలోనే భిన్నత్వంకనపడుతుంది. సమాజంలో అయిదారు వందల కోట్ల జనాభావుంటే ప్రతివ్యక్తీ విలక్షణయినజీవి. ఇన్నికోట్లమంది విభిన్నమనస్తత్వాలుకల వ్యక్తులుగా కనపడతారు. కనుక వీరందరూ ఎవరికి వారు సంపూర్ణవిశిష్టత కల వ్యక్తులు; ఒకరు మరొకరికి నమూనా కారు. అందుచేత ఈ విశ్వాన్ని దర్శించేటపుడు భిన్నత్వంలోఉన్న ఏకత్వాన్ని మనంచూస్తాం. అంతేకాక ఏకత్వం ఎలా భిన్నత్వంగా పరిణ మించిదో తెలుసుకుంటాము. ఈ సమ్యక్ దృష్టి అలవడినప్పుడు రచయితులు విశ్వజనీన విలువలకు ప్రాధాన్యతనిస్తారు. రంగు, జాతి, కులం, దేశం, ప్రాంతం, భాష, లింగభేదమూ వాటిలాంటివల్ల కలిగే తేడాలను శాశ్వత మైనవిగా భావించరు. సామాజిక పరిణామ ప్రక్రియలో ఈ విభిన్నమయిన రూపాలు, అంశాలు సందర్భాన్నిబట్టి అవతరిస్తాయి. ఈవిషయాన్ని ఆమూలాగ్రంగా తెలుసుకున్న రచయిత్రి వాస్తవిక దృక్పథంతోనే సమాజంలోని విభిన్న వ్యక్తుల మనస్తత్వాలను ఊహించి రచనలు చేస్తుంది. అయితే ఇలాంటి రచనలలో 'ఈ సమస్యకు ఇది పరిష్కారం' అనిబండగా కొట్టవచ్చినట్లుగా కన్పడదు; కనపడాల్సిన అవసరమూలేదు. అలాంటిబోధ జరగాలనుకుంటే అది మామూలుగా ఉపాధ్యాయుడుచేసేపని అవుతుంది; స్రష్ట అయిన రచయిత చేయాల్సిన పనికాదు. కాగా పరిష్కార మార్గాన్ని సూచించకుండా ఇలాంటి రచయిత్రి వదలివేయదు. ఏదోఒక పాత్ర దానిని సూచిస్తుంది. ఆ పాత్ర ప్రబోధఫక్కీలో "ఇది పరిష్కారమార్గం" అని చెప్పాల్సిన పనిలేదు. ఆ పాత్రయొక్క నడవడి పరిష్కారమార్గాన్ని స్ఫురింపచేస్తుంది. అందువల్ల మామూలు ప్రచార సాహిత్యానికి ఉండే

దోషం ఈరచనలో వుండదు. కనుక కళాత్మక విధానానికి భంగంకలుగదు. సామాజిక ప్రయోజనం పరోక్షంగా ఒనగూడుతుంది. ఇలాంటి సమస్యా పరిష్కారాన్ని సూచించే పద్ధతిని రచయిత్రులు అవలంబించాలి.

నేటిసాహిత్యాన్ని పరిశీలిస్తే నాలుగురకాల రచనా విధానాలు మనకు దర్శనమిస్తాయి. చదువరులను మరోలోకంలో విహరింపచేసే సాహిత్యం మత్తుమందులాంటిది. సమాజంలోవున్న రుగ్మతలను పోగొట్టటానికి ఉద్యుక్తులవకుండా, ప్రజలు మైకంలోపడి వుండటానికి ఇలాంటిసాహిత్యం ఉపయోగపడుతుంది. దీనిని సమాజం యెడల తీవ్రమయిన అపచారంగా చెప్పవచ్చు. సమాజానికి అద్దంపడుతున్నామని చెప్పే రెండవరకపువారు వాస్తవంగా తాము సమాజాన్ని చిత్రిస్తున్నామని చెపుతున్నారు. దీనికి పెద్దగా ప్రతిభ అక్కరలేదు. రచనావిధానంతో కాస్త పరిచయమున్న ప్రతి వారూ ఈ పనిచేయగలరు. ఈమధ్య నినాదాల కవిత్వంవచ్చింది. దానికి కవిత్వపు విలువలే లేవని నిబ్బరంగా చెప్పవచ్చు.

మరోరకపు సాహిత్యప్రక్రియలో ఒక పాత్ర ద్వారా స్పష్టంగా, బహిరంగంగా, ప్రత్యక్షంగా పరిష్కారమార్గం చూపడం జరుగుతుంది. ఈ కృషికి పూనుకునే రచయిత్రులలో సమాజాన్ని వివరించి దానిని మార్చాలనే ధోరణి కనబడుతుంది. మరోరకంగా చెప్పాలంటే సామాజిక నిబద్ధత ప్రస్ఫుటంగా దర్శనమిస్తుంది. కాని కళాత్మకత లోపించినందువల్ల దీనిని ద్వితీయశ్రేణి సాహిత్యంగా పేర్కొనవచ్చు.

ఉన్నత శ్రేణికి చెందిన సాహిత్యంలో ఏదో ఒక పాత్ర నడవడి చదువరి యొక్క దృష్టినీ, మనస్సునూ ఆకర్షిస్తుంది. పాఠకుని మానసిక స్థాయి, జీవితానుభవం, విషయపరిజ్ఞానాలనుబట్టి ఆ పాత్ర ద్వారా నర్మగర్భితమయిన సందేశాన్ని పొందడం జరుగుతుంది. ఇలాంటి సాహిత్యంలో కళారూపానికి భంగం కానిరీతిలో వస్తుదర్శనం చేసుకోవడానికి వీలవుతుంది. అంతేకాదు. ఉదాత్తమయినపాత్ర మేధాసంపత్తివలన, మానవస్వభావ గుణాలయిన కరుణ, సానుభూతి, ప్రేమ, అనురాగం, వాత్సల్యం, నిజాయితి, సోదరభావం ఇలాంటి గుణాలుకల్గిన ఆ పాత్రవల్ల పాఠకులు ప్రభావితులవుతారు. తద్వారా ఉత్తమ సమాజానికి ఆ రచయిత్రి బాటను

సుగమం చేసిందని చెప్పవచ్చు. ఇలాంటి రచయిత్రి సమస్యను, సంఘర్షణను క్రమపద్ధతిలో వివరణచేస్తూ శాస్త్రీయ పద్ధతితో ముగింపు చెప్తుంది. అలా సమస్యల విషవలయం నుండి బైట పడగల చైతన్యాన్ని, ఆలోచనల్ని మనో నిబ్బరాన్ని, వ్యక్తిత్వాన్ని అందివ్వగల రచయిత్రులే చిరస్మరణీయులు. ఆ రచనలకే శాశ్వతస్థాన ముంటుంది.

o)(—)(o

# సాహిత్యము ! స్త్రీల సమస్యలు

సాహిత్యానికీ, స్త్రీల సమస్యలకూ సంబంధం ఏమిటి అనేది ఒక ప్రశ్న అయితే, రచయిత్రులు తమ రచనలలో స్త్రీ స్థానాన్నీ, స్థాయినీ ఎలా చిత్రిస్తున్నారనేది మరో ప్రశ్న అయింది. ఈనాడు స్త్రీల రచనలు అసంఖ్యాకంగా వస్తున్నాయి. వారి సాహిత్యం కేవలం వంట ఇంటి ముచ్చట్లకే పరిమితమయిందని న్యూనతగా మాట్లాడటం వింటున్నాం. పురుషులను రాయవద్దని రచయిత్రులు అడ్డుపడటంలేదు. ఎన్నో అవరోధాలు, మరెన్నో అడ్డంకులు ఉన్నా తమకున్న పరిమిత జ్ఞానానికి పదును పెట్టి సాహిత్య ప్రక్రియను యథోచితంగా పోషిస్తున్న రచయిత్రులు నిజంగా శ్లాఘనీయులు. వారి రచనలు తీసుకుని వీటిలో సాహిత్యపు విలువలున్నాయని, లేదా ఈ కథలో పసలేదని, లేదా ఈ నవలలో శిల్పం, శైలి, ముగింపు అసంబద్ధంగా ఉన్నాయని సమీక్షించాలి కాని ఆడది రాసిందని అసహనంతో విమర్శించటం క్షంతవ్యంకాదు; సభ్యత అంతకన్నా కాదు. అయితే ఇక్కడ ఒక్క ముఖ్య విషయాన్ని గమనించాలి. వ్యక్తిత్వం కోసం సంప్రదాయంతో సంఘర్షణ పడుతున్న మహిళాలోకానికి ఈ రచన వల్ల ప్రయోజనముందా? స్త్రీ జనాభ్యుదయం కాని సామాజిక స్పృహకాని ఒనకూడ్తుందా? ఈనాడున్న స్త్రీ స్వేచ్ఛను పెంపొందించేదిగా వుంటుందా? లేక ఇంకా నీచస్థితికి దిగజార్చేదిగా ఉంటుందా? యథాతథవాదంతో స్త్రీల బానిసత్వాన్ని బలపరుస్తుందో? లేక కేవలం కాలక్షేప వినోదాలకే పరిమితంగా వుంటున్నదా అనేది చర్చనీయాంశం.

ఈ దశాబ్దపు రచయిత్రులు సైతం స్త్రీల స్థానాన్ని హోదాను వంటయింటికీ, పడకటింటికి మాత్రమే పరిమితంచేస్తూ రాస్తున్నారనేది నగ్న సత్యం. 'నీపాదదాసినై నీకు సేవ చేసుకుంటాను' అంటూముగిస్తున్నారు అత్యధిక సంఖ్యాకులు. 'జుట్టూ, గోళ్ళూ అవివుండాల్సిన చోట ఉంటేనే వాటికిగౌరవం. వాటికి స్థానభ్రష్టత్వం కలిగిననాడు అవి ఎలా పనికి మాలినవిగా పరిగణిస్తాయో అలాగే స్త్రీలు సహితం సంప్రదాయ పరంపరగా వారికి నిర్దేశించిన స్థానంలో వుంటేనే గౌరవం. ఆ లక్ష్మణరేఖ దాటినస్త్రీ

అధోగతి పాలవుతుంది' అంటూ వీరంతా లక్ష్మణరేఖనే సమానాగా చిత్రిస్తున్నారు. పిల్లల్నికంటూ భర్తసేవచేసే గృహిణిగా జీవించడమే ఆమెకు ధ్యేయమని స్తుతిపాత్రమనిచెప్తూ ఆమె జీవితానికి సఫలత ఇం ట్లో నే అంటూ ముగిస్తారు. భద్రతకల కుటుంబాల వలననే భద్రతకల సమాజాలు ఏర్పడతాయని, దానికి స్త్రీ జాతే మార్గదర్శకంగా వుంటున్నదని పొగడటం పరిపాటి అయింది. స్త్రీ కోల్పోయిన వ్యక్తిత్వాన్ని సహనమని, ఆమె అజ్ఞానాన్ని త్యాగమని, ఆమె మూగబాధను ఓర్పుఅని, లొంగుబాటును భారతీయ సంస్కృతి అంటూ స్త్రీలకు బ్రహ్మాండమయిన 'బ్రెయిన్‌వాష్' ఇస్తోంది మన సాహిత్యం.

స్త్రీలు ఇష్టపూర్వకంగా బానిసత్వాన్ని వరించే పద్ధతిని బోధించింది పురాణసాహిత్యమంతా. స్త్రీలకు పాతివ్రత్యానికి, పవిత్రతకు, స్వామిభక్తికీ నాటి స్త్రీ ప్రతీక అయింది. మంచి 'భార్య' అయితేనే ఆమెను ఉత్తమ జాతి స్త్రీయని పొగిడేవారు. నలదమయంతులు, సీతా రాములు, సావిత్రీ సత్యవంతుల కథలలో స్త్రీ భర్తయెడ విధేయతతో ప్రవర్తించాలని, త్యాగంచేయాలని నాటి సాహిత్యం నిర్దేశించింది. నాటినుండి దమయంతి, సావిత్రి, సుమతి, అహల్య ద్రౌపదులను ఆదర్శమహిళలుగా పొ గు డు తున్నారు. పతివ్రతగా మాత్రమే ఆనాటి స్త్రీకి వ్యక్తిత్వముండేది. అగ్నిలో దూకమంటే దూకింది సీత. భర్తచే అమ్ముడుపోయింది చంద్రమతి. రేణుకా దేవి తండ్రి ఆజ్ఞాపిస్తే కొడుకుచే చంపబడింది. సుమతి భర్తను వేశ్యవద్దకు మోసుకెళ్ళింది. పంచభర్తృక అయింది పాంచాలి. గాంధారి భర్తకోసం గ్రుడ్డిగా జీవించింది. భర్త కామంకోసం శర్మిష్ట కన్యగా జీవితాంతం బ్రతికింది. సతిగా నాటి స్త్రీ సహగమనం చేసింది. ఇలా వందలవేల సంఖ్యలో పతివ్రతలుగా పేరుపొందిన 'ఆదర్శమహిళలు' ఉన్నారు అసలు స్త్రీకి పతి సేవతప్ప ఏకోరిక ఉండరాదనేది పవిత్ర ధర్మమయింది. తనకు సెక్సు వాంఛ ఉందన్న శూర్పణఖను అవమానపరచారు. త ప్పు చే సిం ది ఇంద్రుడయినా అతనికన్న అహల్యకే ఎక్కువ శిక్షపడింది. భర్తసమ్మతితో కుంతి ఇతరులకు సంతానం కనడంకూడా స్త్రీకి పతివ్రతాధర్మమే; అయినా కన్యకుపుట్టిన కర్ణుడ్ని గంగపాలుచెయ్యటంకూడా పవిత్రమేనని పొగిడారు.

ధర్మశాస్త్రాల సారస్వతం, పురాణాల సాహిత్యమంతా స్త్రీని పుట్టుబానిసగా బ్రతకాలని సృష్టీకరించాయి. ఠాగూరులాంటి రచయితలు సైతం సంప్రదాయ విలువలను హేతుబద్ధంగా చిత్రించారు. "పురుషుడు స్వేచ్ఛలో ఆనందాన్ని పొందుతాడు. ప్రేమలో స్త్రీ ఆనందాన్ని పొందుతుంది." అంటూ స్త్రీ స్వభావం పురుషస్వభావానికి తోడయినదని "ఇంటాబయటా" అనే నవలలో ఠాగూరు చెప్తూ పురుషాధిపత్యాన్ని నర్మగర్భితంగా సమర్థించాడు.

సమకాలీన స్త్రీల సమస్యలు నేడు కోకొల్లలుగావున్నా రచయిత్రులు వాటిని చర్చించడం లేదనడం సాహసంకాదు. సతీసహగమన నిరోధం, బాల్యవివాహనిషేధం విధవివాహాలు, కన్యాశుల్కం లాంటి సమస్యలపై పోరాడింది, తమరచనలచే ప్రభావితం చేసిరిదీ ఎక్కువగా పురుషులేనని మనకు తెలుసు. ఈనాటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలోవున్న స్త్రీల సమస్యలన్నింటి మీదికి రచయిత్రులందరి దృష్టి ప్రసరించటం లేదని చెప్పక తప్పదు.

ఈనాటి స్త్రీల సమస్యలు అత్యల్పాలు కావు. స్త్రీల కష్టగాథలెన్నో వున్నాయి. ఇంటింటికొక కన్నీటిగాథ వుంది. కొన్ని మనకుగోచరమవుతాయి మరికొన్ని కథలు కన్నీటి వెనుక దాగివుంటాయి. కొన్నిటిని ఊహిస్తాం. మరి కొన్నిటిని అసలే విస్మరిస్తాం. ప్రతి స్త్రీ ఎప్పుడోఅప్పుడు తాను ఆత్మహత్య చేసుకొంటే సరిపోదా అనేభావం స్ఫురించని గృహిణి ఉండనే ఉండదంటే నమ్ముతారా? వైవిధ్యంతోకూడిన సమస్యలు అనేకరకాలు.ఆమెకు వ్యక్తిత్వలేమి, ఆర్థికఅసహాయత్వం, రాజకీయనిరాదరణ, సాంఘిక దోపిడి, వరకట్నం, పరదా, వ్యభిచారం, బాల్యవివాహం, నిర్బంధ వైధవ్యం, మానసికక్షోభ, తిట్టటం, కొట్టటం, చంపటం, అత్యాచారాలు, మానభంగాలు, "సాడిస్టు" భర్తల దురహంకారం లాంటివి చాల ఉన్నాయి. ఈబాధలు భరించలేక ఆత్మహత్యల పాలయ్యేవారు వేల సంఖ్యలోఉన్నారు. మానవజీవితం ఏఒక్క సూత్రానికీ, ఏఒక్క పద్ధతికీ ఎలాకట్టుబడదో మహిళల సమస్యలు ఒకేరీతిలో, ఒకే విధంగా ఉండవు. అసలు స్త్రీ జీవితం ఒక సుడిగుండం. తన భద్రతకోసం అమె అనుక్షణం ఒడ్డునపడ్డ చేపలా కొట్టుకుంటూ ఉంటుంది.

వ్యక్తి జీవితానికి రాజకీయం, సామాజికం బొమ్మబొరుసూ లాంటివి. సాంఘిక జీవితాన్ని, సామాజిక పరిణామాన్ని నిర్ధేశించే రాజకీయాన్ని సాహిత్యానికి దూరం చేయటం నిర్హేతుకమూ అనర్థమూ అనకతప్పదు. కీలకమయిన రాజకీయ వ్యవస్థలో స్త్రీల ప్రాతినిధ్యం అత్యల్పం. జనాభాలో సగభాగమున్నారు స్త్రీలు. అయిదువందల ఇరువదిమంది సభ్యులున్న పార్లమెంటులో స్త్రీలు 18 మంది మాత్రమే. ప్రజాప్రాతినిధ్యం వహించటానికి తామే అర్హులమనేభావం పురుషరాజకీయ నాయకులకు ఉండబట్టి తమ పార్టీలో స్త్రీలను పైకిరానీయరు. ప్రభుత్వ రంగంలోని కీలకస్థానాలన్నీ పురుషులవశమే. చట్టాలన్నీ పురుషులే తయారుచేస్తున్నారు. ఏ రెండో మూడో ముఖ్యస్థానాలలో స్త్రీలు ఉన్నంతమాత్రాన స్త్రీలంతా ముందజ వేశారనుకోవడం భ్రమ. సంఘర్షణ, విప్లవం, పోరాటం, తిరుగుబాటు లాంటి పదాలు రాజకీయాలని, అవి కేవలం పురుషులకు మాత్రమే సంధించినవనే భావన స్త్రీలలోనూ, రచయిత్రులలోనూ ఉండబట్టే సాహిత్యాన్ని రాజకీయాలకు దూరం చేస్తున్నారు. రాజకీయవ్యవస్థలోని బాగోగులను, ముఖ్యంగా స్త్రీల విద్య, ఉద్యోగం, ప్రాతినిధ్యంలాంటి సమస్యలను ఎత్తిచూపే బాధ్యతను రచయిత్రులు స్వీకరించాలి.

ఆర్థికపరమైన వ్యత్యాసం విపరీతంగా ఉంది. ఒకే పనిని ఇద్దరు చేస్తుంటే పురుషుడి వేతనం 100 రూపాయలయితే స్త్రీకి 70 రూపాయలు ఇవ్వటంవల్ల స్త్రీ తక్కువ అనేభావం స్ఫురిస్తుంది. వివిధరకాల వృత్తులలో నిపుణత్వానికి పురుషులకిచ్చే శిక్షణ స్త్రీలపట్ల మృగ్యమవుతున్నది. స్త్రీలను తక్కువ స్థాయి ఉద్యోగాలకు నియమించడం జరుగుతున్నది. ఎంతో అంత సంపాదించుకుందామనే తాపత్రయంతో గతిలేక పనిచేస్తున్నారుస్త్రీలు. పెట్టుబడిదారీ సమాజంలో స్త్రీలకు తక్కువ వేతనాలు ఇచ్చి వారిశ్రమను దోపిడీచేస్తున్నారు. జపాను, దక్షిణకొరియాలలో స్త్రీలచే తక్కువ ఖర్చులతో వస్తువులను తయారుచేయించి వాటిని చౌకగా విదేశాలలో అమ్ముతున్నారు. స్త్రీల ఆర్థిక అసమానత్వంవల్లనే పురుషాధిపత్యం పెరిగింది. ఆర్థికలేమివల్ల ఆమె ఆజన్మాంతంపురుషునిమీద ఆధారపడి అణగారి అణకువతో జీవించాల్సిన పరిస్థితి ఏర్పడింది. స్త్రీల ఈదైన్యస్థితిని గ్రహించని రచయిత్రులు దోపిడీ పరిస్థితులకు అనుగుణంగా వ్యవస్థీకృత పురుషస్వామ్యాన్ని

బలపరుస్తూ ఉన్న సాహిత్యాన్ని తయారుచేస్తున్నారు. తరతరాల బానిస మనస్తత్వాన్ని విస్మరించలేని రచయిత్రులే ఈ దారుణాన్ని పోషిస్తున్నా రనకతప్పదు. రకరకాల సమస్యలలో ఆర్థిక సమస్య ముఖ్యమయినది. ఈ విషవలయంనుండి బయట పడగల చైతన్యాన్ని, ఆలోచనలను ప్రేరే పించగల రచనలు చేసి మార్గదర్శకులు కావాలి కాని సెంటిమెంట్ల ముసుగులో ఆలంబనజీవితాన్ని ఆదర్శమంటూ ప్రోత్సహించటంనింద్యమవుతుంది.

సమకాలీన సామాజిక వ్యవస్థలో ఆధునిక స్త్రీ అగచాట్లు అసంఖ్యాకం. ఆమె జన్మించినదాది పెంపకంలో, విద్యలో, వివాహంలో, దాంపత్య జీవితంలో అన్నివిధాల రెండోరకపు వ్యక్తిగా జీవిస్తున్నదనేది సత్యదూరం కాదు. ఆఖరుకు ఆమె ఎందరినికనాలో నిర్ణయించేది భర్త; కాని పుట్టిన పిల్లలపై సర్వాధికారాలు భర్తవే. ఏ విషయాన్ని ఆమెతో సంప్రదించడు భర్త. ఆమె ఇంటా బయటా అనుక్షణం అవహేళన చెయ్యబడుతున్నది. "అది" అనే నీచ పదప్రయోగం స్త్రీని అవమానించటమే. ఇద్దరూ కలిసి సంపాదించినా ఆస్తులు కొనేది భర్తపేరనే. కొట్టినా, చంపినా, వ్యభిచరించినా పురుషుణ్ణి నిరశించని సమాజం స్త్రీని మాత్రం అనుక్షణం విమర్శిస్తున్నది. ఇలా ఎన్నో పరిమితులకు లోనయిన స్త్రీని, కేవలం ఆటబొమ్మగా మనగల్గుతున్న మహిళను, పురుషుడు విధించినఆంక్షలలో ఊపిరాడక స్వంత ఆలోచనలేక స్వతంత్ర జీవనంలేని ఆమెను అబల, లత అంటూ ఎప్పుడూ ఆమెకు ఏదో ఆధారం, రక్షణ కావాలని రచయిత్రులు సైతం తమ కథలను ముగించటం నిజంగా స్త్రీ జాతికే గొడ్డలిపెట్టు. దురాచారాలపట్ల ఉపేక్ష, ఉదాసీనత సంప్రదాయాలమీద విశ్వాసం రచయిత్రులు విడనాడాలి.

సాంస్కృతికంగా స్త్రీని చాల చులకన భావంతో చూస్తారు- "నీకు తెలియదు, పో" అంటారు. మూడువేల సంవత్సరాలనుండి భారతీయ సంస్కృతి మన నరనరాన నిండిపోయింది. తమకే సర్వహక్కులున్నాయని పురుషులు భావిస్తున్నారు. ఇది ఈ ఒక్కదేశ సమస్యకాదు. ఏ దేశమేగినా ఇదేకథ. కొన్ని విషయాలు మాత్రమే ఆమెకు కేటాయించారు. "నీవుగృహిణివి, మాతృమూర్తివి, నీకుప్రేమ అనురాగం సహజం" అంటూ ఈ సంస్కృతిని

స్త్రీ జాతికి అందిపే వారు మురిసిపోయి అది నిజమని నమ్మారు. పిల్లల్ని కనడమనేది స్త్రీజాతి విశిష్టత; అది ఆమె ప్రకృతికి సహజలక్షణం. దానిని స్త్రీజాతి గొప్పతనంగా భావించాలి. కాని పిల్లల్ని పెంచటానికి] స్త్రీతే అర్హులంటూ తాము జబర్దస్తీగా కూర్చుని ఆజ్ఞలు జారీచేస్తుంటారు పురుష పుంగవులు. ఇలాఎన్నో రకాల స్త్రీ పురుష అసమానత్వం మన కళ్ళకు కనిపిస్తున్న నగ్నసత్యం. ఇక సినిమాలలో స్త్రీ చిత్రణ సరేసరి. నీ పాదదాసిని, నీపాదాలచెంత ఇంతచోటు ఇస్తేచాలునని స్త్రీచే పలికిస్తూ కథముగిస్తారు.

స్త్రీల సమస్యలు, అవమానాలు, ఆత్మహత్యలను చూస్తున్న రచయిత్రులు వీటి విషయాలపై ధ్వజమెత్తి స్త్రీ విమోచనను సాహిత్యంలో ప్రముఖాంశంగా ఎందుకు ఎంచుకోరనేది బాధాకరమైన ప్రశ్న. అభ్యుదయ కరమైన రచనలు చెయ్యాలంటే ముందుగా రచయిత్రులు చిత్తశుద్ధి అలవరుచుకోవాలి; స్పందన, ఆర్తి వారిలో ఉండాలి. సామాజికస్పృహ, శాస్త్రీయదృక్పథం, హేతుదృష్టి వారికవసరం. తక్షణ సమస్యలను, దీర్ఘకాల సమస్యలను, అలాగే వ్యక్తిగత, సామాజిక సమస్యలను సమన్వయం చేసుకోగలగాలి. వ్యక్తిగత విశ్వాసాలను వక్రీకరించి సమాజ విశ్వాసాలుగా, సామాజిక శ్రేయోదాయకాలుగా చిత్రించరాదు. భావవాదులయిన రచయిత్రులు శాస్త్రీయదృష్టిలేక, అశాస్త్రీయమైన కర్మసిద్ధాంతానికి కష్టాలకు ముడిపెట్టి ఏమీ చెప్పలేక, తెలియదని ఒప్పుకోలేక, అర్థంకాక ఈశ్వరేచ్ఛఅని, కర్మఅని యథాతథస్థితిని సమర్థిస్తారు. ఆర్థిక ఇక్కట్ల నివారణకు, మానసిక శారీరక రుగ్మతల నిర్మూలనకు నోములూ పూజలూచెయ్యాలని, బాబాలకు దేవుళ్ళకు మొక్కాలని పాత్రలచేత పలికిస్తారు. పరిమాణపరిణామ చరిత్ర అంతా తెలిసినమనం, శాస్త్ర విజ్ఞానంద్వారా భౌతిక ప్రపంచాన్నిగుర్తించిన మనం భావవాదాన్ని బలపరచటం అర్థరహితం.

స్త్రీ సమస్యలకు సరియయిన పరిష్కారమార్గాన్ని సూచించలేక కొందరు రచయిత్రులు పలాయనవాదాన్ని అనుసరిస్తున్నారు. సమస్యల నుండి దూరంగా జరిగి చిత్ర విచిత్రతి సన్నివేశాలతో కేవలం వినోదం కోసం కాలక్షేపంకోసం రాస్తున్నారు. ఊహాలోకంలో-వాస్తవప్రాతిపదికలేని ఊహాలోకంలో - విహారయానం చేయిస్తున్నారు. ఒక ప్రముఖ నవలా రచయిత్రి ఒకభేటీలో“నాకు ఆకలి, దరిద్రం, చావులు అంటే పరమచికాకు;

వ్యక్తిని ఉక్కిరి బిక్కిరి చేసే సమస్యలంటే నాకు గిట్టదు. అందుకని ప్రేమలు, పెళ్ళిళ్ళు, అనురాగాలు, ఆప్యాయతలే నారచనకు ఆలంబనాలు. నేసుకోరేది కేవలం ధనం మాత్రమే. నాకు కావాల్సింది పేరు ప్రఖ్యాతులే" అనేఅర్థం వచ్చేటట్లు నిర్మొహమాటంగా చెప్పింది. ఇలాంటివారి నవలలకు మంచి మార్కెట్టు పెరగటం మన దౌర్భాగ్యం. కేవలం నవలలు సినిమాలుగా రావడం, పత్రికలలో సీరియల్సుగా వస్తూఉండడం, నవలల సంఖ్య పెరగడం మాత్రమే గీటురాయి అనుకుంటే అంతకన్నా దారుణమైన విషయం మరేదీ ఉండదు. ఇలాంటి సాహిత్యం అజ్ఞానం, అవిద్య, మూఢాచారాలలో మునిగివున్న పాఠకులను ఇంకా దిగజార్చుతుందే కాని వారిలో ఆధునికత చైతన్యం, పురోగమన శక్తిని కలిగించవు.

రచయిత్రులందరూ సామాజిక స్పృహ ని వారని, వాస్తవ దృక్పథంతో రాయటంలేదని, స్త్రీల జీవితసమస్యలను స్పృశించటంలేదని వాదించటం సాహసమవుతుంది. కాని సామాజిక ప్రయోజనాన్ని ఆశించి సమస్యకు పరిష్కారాన్ని శాస్త్రీయదృష్టితో చూపుతూ రాయగలవారు నూటికొకరున్నారు. స్త్రీ బానిసబ్రతుకును నిరసించినవారు, పురుషుల అమానుషత్వాన్ని ఖండిచేవారు, ఆర్థిక విషవలయంలో చిక్కుపడ్డ పడతులను గుర్తించి వారి సమస్యలను తమ సాహిత్యంలో పొందుపరిచినవారు అల్ప సంఖ్యలో ఉన్నారు. అలాగే రాజకీయాలలో స్త్రీలయెడ వివక్షను కథాంశంగా ఎంచుకున్నవారిని వ్రేళ్ళమీద లెక్కించవచ్చు. చాలమంది సంస్కృతి సంప్రదాయాలపేరుతో స్త్రీ స్థానం ఇంట్లోనే వున్నదనే యథాతథవాదాన్ని బలపరచటం శోచనీయం.

దరహం మీనచూస్తే ఇంతవరకు స్త్రీల సామాజిక, కుటుంబ విషయాల పైననే రచయిత్రులు విరివిగా వ్రాశారు. కాని రాజకీయార్థిక సాంస్కృతిక సమస్యలపై రచనలు కొద్దిగానే ఉంటున్నాయి. అన్నిరకాల సమస్యలను, సన్నివేశాలను తీసుకొని ఉత్తమ సాహిత్యాన్ని అందించవలసిన బాధ్యత ప్రతిభకల రచయిత్రులపై ఉన్నది. వ్యక్తిగతంగా తాము అనుభవిస్తున్న

సమస్యలను, తమ బంధువర్గం స్నేహబృందం ఎదుర్కొనే సమస్యలను, సమాజంలో తదితరులను బాధిస్తున్న సమస్యలను రచయిత్రులు ఉత్తమ సాహిత్య వస్తువులుగా స్వీకరించినమేరకు స్త్రీజాతికి విమోచన దగ్గర పడుతుంది. అలా హేతుదృష్టితో, మానవ విలువలయెడ గౌరవంతో, సామాజిక స్పృహతో రచనలు చేయగలిగిననాడు సమాజానికి అందులో ముఖ్యంగా స్త్రీ జాతికి రచయిత్రిలు తమ ఋణం తీర్చుకున్నవారవుతారు.

o)(—)(o

# జానకీరాణి సృజనాశక్తి

శ్రీమతి తురగా జానకీరాణి లాంటి ప్రతిభా వ్యుత్పత్తులు కల వ్యక్తి ఊరక వుండలేదు. ఆమెలో సృజనాశక్తి విజృంభిస్తుంది. అదే జానకీరాణి గారి పట్ల జరిగింది. ఆమె కథలు రాశారు; నవలలు రచించారు. కవితల్లారు అనువాదాలు చేశారు. ఇన్ని సాహితీ ప్రక్రియలలోనూ ఆమె వ్యక్తిత్వం బహిర్గతమవుతూనే వుంటుంది.

కథలు రాయటం చాలా కష్టతరమైన సాహితీ ప్రక్రియ. పోల్చిచూస్తే నవలారచన సులభతరం, క్లుప్తత, మాటల పొదుపు, చక్కనిశైలి, గుండెల్లోకి బాణంలా దూసుకొనిపోయే సన్నివేశం, కథచెప్పేతీరు, ముఖ్య పాత్ర ఆకర్షణ, అన్నిపాత్రలను సమ్యక్ దృష్టితో చూడగల కారుణిక భావం, చమత్కృతి, నీతిపట్ల అభిమానం ఇవన్నీ చోటుచేసుకుంటేనే అదిరాణిస్తుంది. లేకపోతే అది చిన్న చరిత్రో, పెద్దగాథో అయి కూర్చుంటుంది.

కథాశిల్పానికి అవసరమైన ఉపజ్ఞ జానకీరాణిగారికి ఉన్నందువల్లనే ఆమె కథకురాలిగా రాణించింది. ఆమె చేపట్టిన ఇతర ప్రక్రియలో ఆమె సామర్థ్యప్రకటన లేకపోలేదు. కాని మొత్తంమీద పరిశీలిస్తే ఆమె కథలు ఆమె నవలలను, కవితలను తలదన్నుతాయి.

ఆమె వ్రాసిన "జగన్మాత" కథ నన్ను ఆకట్టుకుంది. ఆ కథలో రుక్మిణికి "ముప్పైఏదాటినా పెళ్ళికాలేదు, చేసే దిక్కులేదు". రుక్మిణి తల్లిఅయింది. ఆమెను ఓదారుద్దామని ధనలక్ష్మి, చీవాట్లు పెడదామని "నేను" ఆమె ఇంటికి వెళ్ళాము. ఆమె పిల్లవాడిని చూచాము. ఇళ్ళకు మళ్ళాము. ధనలక్ష్మి ఆమెను ఓదార్చలేదు. కథచెప్పిన "నేను" ఆమెను నిందించనూలేదు; పైగా అంటుంది "అది ఎందుకు ఏడుస్తుంది. హిమాలయ పర్వతాలమీద కూర్చుని మనబోటి వాళ్ళందర్ని చిన్నచూపు చూస్తున్న జగన్మాత అది" ఈ వాక్యం మాతృత్వం యెడచూపాల్సిన గౌరవభావాన్ని వేలెత్తిచూపుతుంది. తల్లికావాలనే సహజ స్త్రీతత్వ ఆర్తిని హృద్యంగా చిత్రిస్తుంది. వర్తమాన సమాజంలో పెళ్ళికాని ఆడపిల్లల వ్యథను ఈ కథ

వెలికితీస్తుంది. సమాజం వారిపట్ల చూపే అసహ్యభావాన్ని కరుణాదృష్టితో త్రోసిరాజంటుంది. పతితయెడ దయార్ద్రదృష్టి, తోటి మనిషియెడ సానుభూతి సంవేదనను వ్యక్తం చేస్తుంది. పిల్లవాణ్ణి నిబ్బరంగా ధైర్యంగా పెంచుకోగల రుక్మిణి మనస్తత్వాన్ని, "వీడి నాన్నకు గుండె ధైర్యంలేక వచ్చి చూడలేదు. తప్పించుకు తిరుగుతున్నాడు. అంత భయపెట్టాడు నా బాబు, అంతటి మగవాడినీ" అని గలగలా నవ్వేసిన రుక్మిణిని బహు దర్పంగా మనకు పరిచయం చేసింది జానకీరాణి మగవారు సమాజం గర్హించే పనులు ఇష్టపడి చేస్తూ రహస్యగోపనంకోసం తంటాలుపడుతూ, దోషభావంతో పిరికితనంతో సతమతమౌతారనే నగ్నసత్యం ఈ వాక్యంలో గోచరమవుతుంది. పది వ్యాసాలు, ఇరవయి నవలలు, వంద ఉపన్యాసాలు అందించగలిగే పెళ్ళికాని తల్లులయెడ సానుభూతిని ముచ్చటగా మూడు పేజీల కథలో బలవత్తరంగా చెప్పింది. ఆమె సామాజిక చైతన్యానికి ఇది ఒక మచ్చుతునక. కథలో వర్ణనకు, నవలలో వర్ణనకు ఎంతో తేడావుంది. కథకుడు తక్కువ సామాగ్రి వాడాలి. కొద్ది పదజాలంతో మహోన్నతమయిన స్పందనను కలుగజేయాలి. ఈ వాక్యం గమనించండి. "దాని కళ్ళనిండా కాటుక, చంపలు పలుచగా, తాంబూలరంజితాలైన పెదవులకు అందమిస్తూ, మెరుస్తున్నాయి. కాళ్ళకు చెప్పులు. బాలింత తనం ఇంకా జివ జివ లాడుతూ పచ్చిగా వంటిని చుట్టుకున్నట్లు కనిపించింది." ఎంత చక్కని పదవిన్యాసం, ఎంత వర్ణనా ప్రతిభ!

మరో కథ 'తరలి వెళ్ళాము". కథాభారతి వారి తెలుగునాటి 2[illegible] కథలలో అది ఒకటి. ఇది"జగన్మాత"లాగానే ఉత్తమ పురుషలో రాయబడిన కథ. ఇలా ఉత్తమ పురుషలో కథ రాయటానికి ఎంతో నేర్పువుండాలి. ఇందులో ఇతివృత్తం ఏమంటే ఒక స్త్రీ అభిమానించిన పురుషుడు రెండుసార్లు ఆమె స్నేహితులను వివాహమాడటం ఆమె ఆ పెళ్ళిళ్ళకు తరలి వెళ్ళడం, ఆమె "ఇక్కడే, ఈ గ్రుడ్డి వెన్నెలలో వంటరిగా" మిగిలి పోవడం చిత్రింప బడ్డాయి. పెళ్ళికాని ఆడపిల్లల మనస్తత్వం, అవాచ్యంకాని కోర్కెలు, హృదయాంతర్గత వాంఛలు, ఆశలూ, నిరాశలూ, బహుసున్నితంగా సుతారాంగా వ్యక్తీకరించబడ్డాయి. ఈ సంఘటన ఈ దేశంలోనే కాక మరే

దేశంలోనైనా జరగవచ్చు. ఇతివృత్తం సార్వజనీనం, సార్వకాలికం. నాగరికతలను అధిగమించి, సంస్కృతి రూపాల వైవిధ్యాన్ని దాటి, దేశాల యెల్లలను విస్మరించి, మానవ మనస్తత్వ పరిశీలనకు ప్రయత్నించిన జానకీరాణిగారు శ్లాఘనీయులు.

'లేచి పోయింది' అనే కథలో అమాయకురాలయిన స్త్రీ ఎలాంటి సన్నివేశాలలో ఇరుక్కుంటుందో, ఆమె సంతానం ఎలా చిక్కుల్లో పడతారో, సలహాచెప్పినవారు తరువాత ఎంత నేర్పుగా తమ బాధ్యతను తప్పించుకొని నీతివాక్యాలు వల్లె వేస్తారో వివరింప బడింది. ఇందులో భా ర త జా తి సామాజిక పరిస్థితి అభివర్ణింపబడింది.

'నాది పాత కలమే కదా అని, వ్రాతమొదలు పెడదామంటే, నా నుదిటి గీతలా వంకరపోయింది పాళి'. ఇది గుండెలను పిండిచేసే విషాద గీతం. పాఠకులమనస్సులను దుఃఖంతో ముంచేస్తుంది. అంతటితో అగదు. నర్మ గర్భితంగా ప్రశ్నను లేవనెత్తుతుంది. మానవుడు కష్టాలపాలయి, నష్టపడి, వ్యథచెంది, నిరాశా నిస్పృహలతో కృంగిపోవాలా లేక గుండె నిబ్బరంతో ధైర్యాన్ని సంతరించుకొని జీవయాత్ర సాగించాలాః ఇదీ ఒక సవాలు మానవాళికి.

'బొమ్మలపెళ్ళి' కథలో సరదాగా ఆడుకొనే ఈడులో బరువుబాధ్యతలతో కూడుకునే గృహస్థాశ్రమ ప్రవేశం ఎంతబాధాకరమో వివరించింది. ఆమె కథలలో వస్తువైవిధ్యం, సహజత్వం కన్పడతాయి. 'చూపులు కలసిన శుభవేళ' "స్త్రీలకు ప్రత్యేకం" 'చరాచర ప్రపంచంలో భార్య అనే జీవి'కథల్లో స్త్రీల ఇక్కట్లపై సానుభూతి, మహిళోద్యమానికి ఉత్తేజం కలిగిస్తాయి.



# 'వెలిగిన జ్యోతి' లోని స్త్రీ పాత్రలు

నర్మద వివాహపూర్వం భర్తతో తన సంపాదన విషయమై ఒప్పందం చేసుకుంది. దాని ప్రకారం తన జీవితంలో సగం పుట్టింటి వారికి అమె హక్కుగా అందజేయవచ్చు. కాని వివాహానంతరం ఆమె పరిస్థితి విషవలయంలో చిక్కుకున్నది. ఆమె సంపాదనలో ఒక్కపైసాకూడా పుట్టింటివారికివ్వరాదని ఆమెభర్త పట్టుపట్టాడు. వాగ్దానభంగం చేసిన మగనితో కాపురం కొనసాగించాలా అక్కరలేదా అని ఆమెకున్న సమస్య. వ్యక్తిత్వమున్న స్త్రీగా తను ఏంచెయ్యాలి? ఆమె నిర్ణయానికొచ్చింది. భర్తను ఒదిలేసి నర్సువృత్తిచేస్తూ తోటి ప్రజలమీద ప్రేమాభిమానాలు వెదజల్లుతూ జీవితాన్ని సార్ధకం చేసుకుంది.

మరోపాత్ర బీనాదేవి కులాంతర వివాహం చేసుకున్నాక అమె కష్టాలు ప్రారంభమయ్యాయి. మరో కులపు స్త్రీని ఉంపుడుగత్తెగా వుంచుకున్న ఆమెతండ్రి ఆమె భర్తను చంపించాడు. అయినా ఆమె మొక్కవోని ధైర్యంతో పరిస్థితుల్ని ఎదుర్కొని తండ్రిలేని తన బిడ్డను సాకింది. నర్మద, బీనాదేవి ఇద్దరూ నవలలోని ముఖ్యపాత్రధారి కాంచనకు మనోనిబ్బరాన్ని అందించారు.

వెలిగినజ్యోతి నవలలో ఎక్కువగా కాంచన కథ వస్తుంది. తల్లిని కోల్పోయిన కాంచన మాతామహుల పెంపకంలో యెదిగి, తండ్రి వ్యాధి పీడితుడై వుండగా సవతితల్లి కుతంత్రాలకు బలిఅయి, సవతితల్లి తమ్ముడికి భార్య అవుతుంది. అతడు వ్యభిచార గృహానికి బ్రోకరు. ఆమెను అమ్మి డబ్బు చేసుకుందామని మొదట్లో తలచినా ఆమెకు కలిగే ఆడపిల్లల్ని అమ్ముకుంటే మరింత డబ్బు వస్తుందనే ఆశతో ఆమెతో కాపురం సాగిస్తాడు. బంగారంలాంటి ఆమె బిడ్డలిద్దర్ని అరబ్బులకు అమ్మతానని బెదరించి సంతానాన్ని ఆశించే ఒక జమిందారుకు ఉంపుడుగత్తెగా తన భార్యను

పంపి సొమ్ము చేసుకుంటాడు. జమిందారు ద్వారా బిడ్డనుకని వారికిచ్చి ఇంటికిచేరిన కాంచన తన ఇద్దరాడపిల్లల్ని కానక పరితపిస్తుంది. అప్పటికే వారిని భర్త అమ్మేశాడు. ఈ విషయం తెలిసి శోకతోక్కిన త్రాచైన కాంచనను భర్త 'కులటా' అని పిలిచి ఆమెను బలవంతంగా వ్యభిచార గృహానికి చేర్చబోతాడు. ఆమె అతనికి ఎదురు తిరిగి కత్తిపీటతో అతని నెత్తిపై కొడుతుంది అతను చనిపోతాడు. కాంచన ప్రవర్తన సమంజసమా? అసమంజసమా? అనేదే నవలలోని ముఖ్యప్రశ్న.

మహిళా ప్రపంచపు దయనీయస్థితిలో ఇరుక్కున ముగ్గరు వివాహిత స్త్రీల స్థితిని ఈ నవలలో చిత్రించారు రచయిత్రి మల్లాది సుబ్బమ్మగారు.

(o) ● (o)

" స్త్రీకి శరీరంవుంది, దానికి వ్యాయామం కావాలి. ఆమెకు మెదడు వుంది దానికి జ్ఞానం ఇవ్వాలి. ఆమెకు హృదయంవుంది దానికి అనుభవం ఇవ్వాలి"

—చలం.

# మన వివాహ విధానాల్లో మార్పులు మనకం తెలుసా?

భారత దేశ వివాహాల్లో అనేక మార్పులొచ్చినై. మొదట్లో ఒక గుంపులోని పురుషులకు మరో గుంపులోని స్త్రీలతో సంపర్కముండేది. తండ్రికి పిల్లల బాధ్యతాలేదు కుటుంబవ్యవస్థాలేదు. వర్ణాశ్రమ ధర్మాలొచ్చాక బ్రాహ్మణుడు నాల్గువర్ణాల స్త్రీలను వివాహమాడవచ్చు. కాని బ్రాహ్మణ స్త్రీని మిగితా మూడు వర్ణాలవారూ వివాహ మాడరాదు. "అగ్ర"వర్ణ స్త్రీని 'అల్ప' వర్ణ పురుషుడు వివాహమాడితే 'అనులోమ' అని 'తక్కువ' కుల పురుషుడు "పెద్ద" కులం స్త్రీని వివాహమాడితే "ప్రతిలోమ" అని పిలుస్తూ వారిని సంఘ బహిష్కారం చేసేవారు. వారి బిడ్డల్ని హీనకులజులుగా పరిగణించేవారు కొన్ని తెగలలో వివాహమైన మొదటిరాత్రి పిల్లని పురోహితుని పరంచేసే దురాచారం వుండేది. కొన్ని ప్రదేశాలలో పిల్ల తల్లినే వివాహమాడేవారు. తదుపరి బహుభార్యాత్వం, కొన్ని ప్రాంతాలలో బహుభర్తృత్వం ఆచారాలయినయి.

మొదట్లో మతాలు సామాజిక జీవితాన్ని బహుళంగా విస్తృతంగా నియంత్రణము చేశాయి. ఒక్కొక్క మతం అది పుట్టిన దేశంలోని రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక పరిస్థితులనుండి ప్రత్యేక నియమాలను ఏర్పరచుకుంది. ఆ దశలోనే మన దేశంలో రుషులు అనేక ధర్మశాస్త్రాలను రచించారు. వాటిలో ముఖ్యమైనది మనుధర్మశాస్త్రం. అందులో అష్టవిధ వివాహాలు రూపొందినై. బ్రహ్మ, దేవ, ప్రాజాపత్య, అసుర, గాంధర్వ, ఆర్ష, రాక్షస పైశాచములు అవి. మానవ జీవితంలో వివాహంఉత్కృష్టమైనది జీవితాంతం సహచర్యానికి, సన్నిహితత్వానికి; ఆత్మీయతకు ఏర్పడినదే వివాహం. సభ్యమానవ సమాజం ఏర్పడినప్పుడు సమాజంలో మార్పు అనివార్యం అయింది. అతి ముఖ్యమైన వివాహ వ్యవస్థలోకూడా అనేక మార్పులు రాకతప్పలేదు. పురోగమనం మెప్పుడూ మౌలికమైన మార్పును కోరుతుంది.

బాల్య వివాహ నిషేధ శాసనం 1929 లో వచ్చింది. ఈనాటి బాల్య వివాహ చట్టంక్రింద వధువుకు 18, వరునికి 21 ఏండ్లు నిండాలి. అంతకు తక్కువ వయస్సువారు పెళ్ళాడినా, మనంచేసినా శిక్షాపాత్రులం. అయితే ఆ వివాహం చెల్లదనే నిబంధనలేదు. అయితే ఆమె 18 ఏండ్లు నిండేలోగా తనకు ఈ పెండ్లి వద్దనేహక్కు మాత్రం ఇచ్చారు. అదేవిధమైన ముస్లిం కన్యకు మాత్రం ఆ హక్కులేదు. దాంపత్య జీవితంలోకి ప్రవేశించనప్పుడు మాత్రమే ముస్లిం వధువుకు ఆ హక్కువుంది. అయితే 14 ఏండ్ల పిల్ల 16 ఏళ్ళ బాలుడు వివాహ బంధంలో ఇరుక్కున్న పార్శీమతస్తులకు పార్శీ చట్టం ప్రకారం ఆ వివాహాన్ని కోర్టు అమలు పరచదు. ఇలాశిక్షలువేసేకన్నా బాల్య వివాహాల రద్దును శాసనం చేస్తేనే మంచిది. కోర్టుల భాష్యాలకు వదలివేయటం భావ్యంకాదు.

హిందూ వివాహశాసనం 1978 వరకు మారుతూనే వుంది. 1939లో ముస్లిం వివాహ సవరణ చివరిసారి జరిగింది. 1872 నాటిదే క్రైస్తవ వివాహ శాసనం, 1838 లోని క్రైస్తవులకు వర్తించే విడాకుల చట్టం ఇంకా అమలులో ఉన్నాయి. పార్శీ వివాహశాసనం 1936 నాటిది. ఏమతానికి చెందని వారికీ, ఆ శాసనంక్రింద వివాహ చేసుకునేవారికీ వర్తించే ప్రత్యేక వివాహశాసనం 1954లో పుట్టింది.

పెండ్లి సందర్భంగా ఏయే మార్పులు ఎలా వచ్చాయో వ్రాస్తే పెద్ద గ్రంథమవుతుంది. ఒక విషయం మాత్రం సత్యం. ఎంతో పురోగతిని ఇతరత్రా విద్య, ఉద్యోగాలలో సాధించిన క్రైస్తవులు ఇంకా 19 వ శతాబ్దపు చట్టాలకు లోనయి ఉండటం శోచనీయం. ముస్లిం లా ఆ నాటి అరబ్బుల ఆచారాలను సవరించిన కొరాను సూత్రాల ప్రకారం ఉంది; అంటే 12 వందల సంవత్సరాలనాడు నిర్దేశించిన దన్నమాట. కాలంమారింది; సమాజం మారింది. అయినా మహమ్మదును చివరి ప్రవక్తగా పరిగణించి మార్పును వ్యతిరేకిస్తున్నారు సనాతన ముస్లింలు. ఇది వారికీ, భారత సమాజానికీ నష్ట దాయకం.

దేశం యావత్తుకు పౌరులందరికి వర్తించే ఒకే ఒక వ్యవహార సంహితను **(Common Civil Code)** రూపొందించటానికి ప్రభుత్వం కృషిచేయాలని భారత రాజ్యాంగ 44వ అధికరణములో స్పష్టీకరించబడింది.

రిపబ్లిక్ రాజ్యస్థాపన జరిగిన 32 ఏండ్ల తరువాత కూడా ఈ సందర్భంగా ఏ ప్రయత్నమూ జరగకపోవటం గమనార్హం. ఈ పరిస్థితికి దోహద కారణాలు అనేకం. అల్ప సంఖ్యాక వర్గాలలో తగినంత మంది పలుకుబడి గలిగిన సంఘ సంస్కర్తలు లేకపోవడం, అల్ప సంఖ్యాకుల మత భావాలకు విరుద్ధంగా సవణలు తెచ్చి వారిని రెచ్చగొట్ట రాదనే పాలకుల వైఖరి, పాలకపార్టీలు ప్రతిపక్ష పార్టీలు అందరు కూడ సంస్కరణలకు పూనుకుంటే అల్పసంఖ్యాకుల వోట్లు తమకురావనే భయాందోళనలు ఇవన్నీ ఈ శోచనీయ పరిస్థితికి కారణభూతాలు.

క్రైస్తవ ముస్లిం వివాహాలను రిజిష్టరులో నమోదుచేస్తారు. హిందూ వివాహాన్ని రిజిష్టరు చేయించుకోవచ్చు. కాని విధిగాచేయించుకోవాలనే శాసనంలేదు. వివాహాలు తప్పకుండా రిజిష్టరు చేయించడానికి శాసనం చేస్తే బాగుంటుంది.

ముస్లిం వివాహ విధానంలో 'నికా' రిజిష్టరులో వధువు చెయ్యదు, ఆమె తరపున దగ్గర బంధువైన పురుషుడు 'వకీలు'గా దస్కతుచేస్తాడు. అంతేగాదు; ఆమె వివాహానికిపూర్వం వరుని చూచే అవకాశం లేనేలేదు. ఇది శోచనీయం.

క్రైస్తవ పెండ్లి పద్ధతిలో మత గురువువద్ద నుండే రిజిష్టరులో వధూవరులు దస్కతుచేస్తారు. "భర్తకు విధేయురాలుగా ఉంటాను" అని వధువుచేత ప్రమాణం చేయిస్తారు.

ప్రత్యేక వివాహ శాసనం క్రింద సబ్ రిజిస్ట్రారు వద్ద 21 సం॥లు నిండిన వరుడు, 18 సం॥ నిండిన వధువు సతీపతులుగా ఉండటానికి పరస్పర అంగీకారాన్ని తెలుపుతూ రిజిష్టరులో దస్కతుచేస్తారు. ముగ్గురు వయోజనులు సాక్షి సంతకాలు చెయ్యాలి.

వివాహ విధానాల విషయం పరిశీలిస్తే హిందూ వివాహ శాసనంలోని లోపం కొట్టవచ్చినట్లు కన్పడుతుంది. హిందూ మతస్థులు, బౌద్ధ, జైన మతావలంబకులు మాత్రమే కాక ఇస్లాం, క్రైస్తవం, పార్శీ, యూదుమతాలకు, చెందకుండా భారతదేశంలో స్థిరనివాసం కలిగియున్న ప్రతి భారతీయుడూ

హిందువు క్రిందే లెక్క. అంటే హేతువాదులు, నాస్తికులు, అజ్ఞేయవాదులు, స్వేచ్ఛా భావుకులు వీరంతా హిందువులే. వారికి హిందూ వివాహ చట్టం వర్తిస్తుంది. అయితే, వధూవరులలో ఏ ఒకరి ఆచారం ప్రకారమైనా వివాహం జరగాలని నియమం. సప్తపదిని ఆచారంగా ఆమోదించేవారికి ఏడవ అడుగువేస్తే పెండ్లి పూర్తి అయినట్లులెక్క. ఇది హిందూమతస్తులకు సంబంధించినది. తతిమ్మావారు వారి ఆచారాన్ని కోర్టులో ధృవపరుచు కోవాలి. అది వ్యయప్రయాసలతో కూడినపని. ఇది హేతువాదులు వగయిరాల పట్ల వివక్షా విధానం. తమిళనాడులో పూలదండల పెండిండ్లు, స్వయంవర వివాహాలు ఏ భాషలో జరిగినా 1967 నుండి చెల్లుతున్నాయి. అలా శాసనం తెచ్చింది ఆనాడున్న రాష్ట్ర ప్రభుత్వం. తతిమ్మారాష్ట్రాలలో ప్రభుత్వాలు కూడా అలా చేస్తాయని ఆశించడంలో పొరపాటులేదు.

పెండ్లి పద్ధతిలో మార్పుతెచ్చేశాసనం వెన్వెంటనేరావాలి. సర్వులకూ వర్తించే విధానాన్ని చట్టబద్ధం చేయుటంన్యాయం; అవసరం. అపుడే స్త్రీలు మతాల విషకౌగిలి నుండి బయటపడి స్వేచ్ఛా వాయువులు పీల్చ గలుగుతారు.



బహిష్టు అంటే?-శాపం, మురికి, అశుభ్రం అనే మూఢభావంవుంది. కాని గర్భాశయంలోకి క్రొత్తగా చేరిన రక్త మాంసాలు, ఇతర పదార్థాలు బయటి కొచ్చేస్తాయి. బహిష్టుకాకపోతే ఇవి ఒక క్రొత్త ప్రాణికి పెరుగుదల నిస్తాయి. ప్రకృతి సహజంగా శరీరం నిర్వర్తించే ఒక ముఖ్యమైన భావం వల్ల ఈ దృక్పథం మారదా?

# ఈ వ్యవస్థ ఉచ్చులో చిక్కుకున్న మహిళ

తరతరాలుగా మహిళలు తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకోవడం కోసం, తమ ఉనికి గుర్తింపుకోసం పడ్డ అగచాట్లు ఇన్నీ అన్నీ కావు. అసలు హక్కులకోసం ఎలాంటి సంఘటనలను మహిళలు ఎదుర్కొన్నారో తెలిసుకొంటే ఆశ్చర్యం కలుగకమానదు. న్యూయార్కులో 1921 లో మార్గరేట్ సాంగర్ 'గర్భనిరోధం అవినీతా?' అన్న విషయంపై ఒక సభ ఏర్పాటు చేసింది. తీరా ఆమె ఆ సభలో ఉపన్యసించబోయే సరికి టౌను హాలు తలుపులు మూసేసి, సభను ఆపుచేసి, సభీకులను తిరిగిపొమ్మని ఆర్డరిచ్చారు. అయినా సాంగర్ మొక్కవోని ధైర్యంతో 'మీరువెళ్ళిపోకండి అనిఅరుస్తూ 'సభజరిగితీరుతుందని' హెచ్చరిస్తూ ఉపన్యాసం ప్రారంభించగానే పోలీసులు ఆమెను లాక్కెళ్ళారట. అలాగే ఫ్రెంచి రచయిత్రి మేరీబలం పీడిగేజ్ స్త్రీల హక్కుల ప్రతిపాదన కొరకై 1791 లో **'Declaration of The Rights of Women'** అనే పుస్తకం రాసి చరిత్రను సృష్టించింది. "1789లో జరిగిన ఫ్రెంచి విప్లవంలో స్త్రీలు ఉరికంబం ఎక్కగలిగినప్పుడు పరిపాలనలో మాత్రం స్త్రీలకు స్థానం ఎందుకివ్వరు?" అని గేజ్ ఆ పుస్తకంలో ప్రశ్నించి నప్పుడు, ఫ్రెంచి విప్లవానంతరం చెలరేగిన అరాజకత్వంలో ఆమెను దేశద్రోహిగా చిత్రీకరించి ఉరితీశారు. ఆసమయంలో ఆమె గర్భవతి. అయినా విచక్షణ చూపలేదు ఆమెపట్ల ఆనాటి కసాయి ప్రభుత్వం. అసమాన ధైర్యంతో "ఆడవాళ్ళకు సమానహక్కులు కావాలి"అని అరుస్తూ ఉరికంబమెక్కి ప్రాణాలను వదలిందా త్యాగమూర్తి.

1973లో-స్త్రీల హక్కుల్లో అతి సామాన్యమైన హక్కు-తమ శరీరంపై తమకు హక్కు అంటే తమకు ఇష్టంలేని గర్భధారణను విచ్ఛేదం చేసుకునే హక్కు ప్రసాదించింది ప్రభుత్వం. అంటే 1921 లో సాంగర్ కోరినహక్కు 52 సం॥ తర్వాత అమెరికను స్త్రీలకు అమెరికన్ సుప్రీమ్ కోర్టు ఇచ్చింది. ఖూనీలు జరుగుతున్నాయి. నేరస్తులను ఉరితీస్తున్నారు. యుద్ధాలలో సైనికులను హతమారుస్తారు. తిండిపెట్టలేక, వైద్యం చెయ్యలేక చంపవచ్చు కాని ఇష్టంలేని గర్భవిచ్ఛేదం నేరమని స్త్రీలను శిక్షించుట స్త్రీలపై చిన్న

చిన్నచూపుకాదా? ఆమె శరీరంపై హక్కు ఆమె కోరటం నేరమా? ఈహక్కు స్త్రీల ప్రాథమిక హక్కుగా పరిగణించరా?

1917 రష్యన్ విప్లవానికి పూర్వం జారు ప్రభుత్వంలో రష్యన్ స్త్రీల అగచాట్లు వర్ణనాతీతం. వారు అడుగడుగునా ప్రాణాలకు సైతం ఎదురొడ్డి విప్లవంలో పాల్గొన్నారు. ఓటు హక్కుకోసం మూడుదశాబ్దాల బ్రిటిష్ స్త్రీల పోరాటం మనకు తెలియనిది కాదు. వారి ధర్మమా అని భారత స్త్రీలకు కూడా ఓటుహక్కు వచ్చిందిగదా!

సమాజంలో స్త్రీల సమస్యలకు వ్యవస్థలో మౌలికమైన మార్పు రానిదే పరిష్కారం అసంభవం అని తెలియనివారు వ్యక్తుల మంచి తనం వల్ల పరిస్థితులు చక్కబడతాయనే భ్రమకు లోనౌతున్నారు. అసలు వ్యవస్థ మారాలంటే వ్యవస్థలో అవమానం, కష్టనష్టాలు పొందుతున్నవాళ్ళే ఎదిరించాలి. వారిలో ముందుగా తమ సమస్యలను పరిష్కరించుకోగల ఆత్మ స్థయిర్యం రావాలి. ఈ అసమానతలకు, అవమానాలకు ఒక ముఖ్య కారణం భావదాస్యం, అజ్ఞానం. ఈ అజ్ఞానం నుండి విముక్తులు కావాలంటే స్త్రీలు విజ్ఞానవంతులు కావాలి.

మనిషికి తన జీవితాన్ని సుఖవంతం చేసుకోవాలనే ప్రాథమిక వాంఛ మిక్కుటంగా వుంటుంది. అయితే ఆ సుఖం అనేదానికి అర్థం మాత్రం ఆ వ్యక్తుల దృక్పథాలను బట్టివుంటుంది. అసలు వ్యక్తికి ఏ స్వేచ్ఛా లేకుండా సుఖపడటం అనేది అర్థరహితం. అలాగే జీవిత సమస్యలు, మానవ విలువలపట్ల ఏమాత్రం అవగాహనలేకుండా సుఖపడుతున్నాం అనుకోవటం అవివేకం. ఇలాంటి భ్రమల్లోనే జీవిస్తున్నారు నేటి మన స్త్రీలు. ఆ భ్రమల నుండి ఎవరూ ఎవర్నీ ఉద్ధరించలేరు; బైటికిలాగలేరు. అలా బలవంతంగా ఇతరుల ప్రమేయంవల్ల వచ్చేమార్పులచేత అసలు సమస్యలు మరింత గందరగోళంలో పడి విషమిస్తాయి. కనుక ఎవరికి వారే అంటే స్త్రీలు వ్యష్టిగాను, సమష్టిగాను తమ సమస్యలను పరిష్కరించుకోగలిగితే నిజమైన మార్పువస్తుంది.

(o) ● (o)

# పడుపు వృత్తికి బాధ్యులెవరు?

'ప్రపంచంలో ఏ దేశంలోనూ వేశ్యావృత్తి ఒక కుల వృత్తిగా అమల్లో లేదు. ఇది భారతదేశ దౌర్భాగ్యాల్లో మొదటిది" అని కందుకూరి వారు వివరించారొకచోట. అది మన సమాజానికి పట్టిన గ్రహణం, కుటుంబాలను కూలుస్తున్న శనిగ్రహం. ముఖ్యంగా స్త్రీ జీవితాన్ని దుర్భరం చేస్తున్న పైశాచికం. దీన్ని కులవృత్తిగా స్వీకరించటం అవమానకరం. అయినా ఈ వృత్తి యుగయుగాలుగా, తరతరాలుగా పాతుకు పోవటం, వృద్ధిపొందటం శోచనీయమే కాదు, బాధాకరం కూడాను.

ఈనాడు వాడవాడలా వేశ్యాగృహాలు వెల్లివిరిశాయి. ఇంకా పెరుగుతున్నాయి. నేటి వ్యాపారాలలో వేశ్యల సరఫరా వృత్తి, పడుపు గృహ నిర్వహణ వృత్తి ముఖ్యమైనది. తేలిక అయినవి; లాభసాటివి కూడాను. ఒకస్త్రీ వేశ్యావృత్తిచేస్తూ జీవించాల్సిన పరిస్థితి బాధాకరమేకాదు, అది మన సామాజిక పతనానికి మూలం అనక తప్పదు. ఇంతటి ఈఘోరానికి కారకులెవ్వరు? ఆ నీచవృత్తి చేస్తేతప్ప ఆమెకు జీవయాత్ర సాగని పరిస్థితిని కల్పించిన దెవ్వరు? దాన్ని పోషిస్తున్నదెవ్వరు? మరి ఆ పురుషుల్ని ఎంత మందిని జైళ్ళల్లో పెడుతున్నారు? వేశ్యకూడా ఒక వ్యక్తే అనేభావం ఎంత మందిలో ప్రోదిచేసుకుంది? ఆ అభిప్రాయాల ఆధారంగా న్యాయమైన శాసనాలు ఉన్నాయా? ఎందుకులేవు? సభ్య సమాజంలో శాసనరీత్యా వేశ్యావృత్తిని నిరోధించ పూనడం సాధ్యమా? ఇప్పుడున్న శాసనాలు పక్షపాత యుతంగాలేవా? విటులను వదలి వేశ్యలను దండించడం న్యాయమా? ఇంగ్లండులో, ఫ్రాన్సులో వేశ్యల శరీరాలను డాక్టర్ల చేత పరీక్ష చేయించే వారట. ఇష్టపడని వారిని జైళ్ళలోపెట్టి హింసించేవారు. దానివల్లవారు శారీరకంగా మానసికంగా, బాధపడేవారు. ఇది ధర్మమా? న్యాయమా?

ఇప్పటి వరకు మన సమాజాన్ని శాసించింది మతం. వేశ్యాగృహాలను పవిత్రస్థానాలుగా భావించడం వేశ్యలను ఉంచుకొనడం ఆనాడు పండితుల నుండి పామరుల వరకు ఆచారంగా వుండేది. మహారాజులే కాక

జమిందారులు, వ్యాపారస్తులు, పూజారులు, కవులు, గాయకులు మొదలగు సర్వులకు అదొక భేషజంగా వుండేది. "సాని లేని వాణ్ణి పనికి మాలినవాడు"గా చూచే రోజులుండేవి. ఎంతమంది పురుషులు వారివద్దకు వెళ్ళివస్తుంటే అంత ఘనత, హోదా వేశ్యలకు (చింతామణిలాంటి) దక్కేది. వారితో సంపర్కంకోసం విటులు పడిగాపులు కాచేవారు.

వేశ్యలను గూఢచారిణులుగా ఉపయోగించుకొనుట నాటిరాజకీయ తంత్రాలలో ముఖ్యమైనది. పట్టపురాణులు, అంతఃపురాంగనులు సైతం తమ భర్తలు వేశ్యాలోలురై చరిస్తుంటే తామూ ఆనందించేవారు. వేశ్యలకు నృత్యము, నాట్యము, సంగీతం తప్పక నేర్పించేవారు. విటులు వారిగానకళా కౌశల్యాన్ని తిలకిస్తూ తన్మయులవటం ఆనాటి వారి సరదాలలో ముఖ్యమైనది. ఆనాడు కన్నెరికంపెట్టిన వాణ్ణి ఘనంగా శ్లాఘించడం రివాజు. నాటి విధానాలు పద్ధతులు మారినా వృత్తిలో మార్పులేకపోవటం దుర్భరం.

దేవదాసీల పేరుతో ఒక వర్గాన్ని సృష్టింపుచేసి భోగపు కులమని పేరు పెట్టి దానికి శాశ్వతత్వం కల్పించారు రాజగురువులు, మతగురువులుకూడా. హిందూమతం ఏనాడూ వేశ్యావృత్తిని నిందించిన ఘట్టాలు లేవు. వ్యభిచారాన్ని పైకి నిరసిస్తూ, అవినీతికరమని ప్రకటనలు చెస్తూ మధ్యయుగంలో క్రైస్తవ మఠాధిపతులు ఉంపుడుకత్తెల్ని కలిగివుండలేదా? తమ పరిచారికలను తమ భర్తకు ఉంపుడుగత్తెగా యాకూబ్ భార్యలు ఇచ్చారు. గ్రీసు దేశంలో ఏథెన్సులో 594 బి. సి. లోసలోర్ ప్రభుత్వ వ్యభిచార గృహాలను నడిపాడట. క్రీ. పూ. పారింతేదేశంలో ఆఫ్రోసైట్ అనే దేవత గుడిలో వెయ్యిమంది వ్యభిచారిణులను పెట్టి పలుకుబడి గలవారు వీరివద్దకురాకపోకలు చేసేవారు. అబ్రహాం తనభార్య సారాను ఇతరులకు అద్దెకిచ్చేవాడు. ఆనాడు భిషప్పులకూ, మతాధికారులకు (ఫాదర్) ఈ వృత్తిపై నిరసనగాని, ఏహ్యభావంకాని వున్నట్లు ఆధారాలులేవు. అసలు ఆ నాటి సంపన్నుల భోగలాలసే పడుపువృత్తికి మూలకారణం.

పడుపు వృత్తి శాశ్వతస్థానాన్ని పొందడానికి కారణాలు అనేకం. వేశ్యగా జీవించడానికి ప్రధానమైనది ఆర్థికలేమి; ఆమె నైతిక పతనానికి

ఆ నాటి సంపన్నుల భోగలాలసత ముఖ్య కారణం. క్రమేపి అది ఆచారమై పోయింది.'అష్టవర్షాత్భవేత్కన్యా'అనే ఆచారంతో బాల్య వివాహాలు విరివిగా జరిగేవి. కన్యలను వృద్ధులకు కట్టబెట్టేవారు. అన్నెంపున్నెం ఎరుగని బాల వితంతులకు గత్యంతరంలేక, ఆదరణలేక, రక్షణలేక కొందరు వృత్తిలోకి దిగజారిపోయ్యేవారు. నాటి రాజులు రాజరిక వ్యవస్థ పటిష్టత కోసంయుద్ధాలు జరపటంసర్వసామాన్యం. ఆ మారణ హోమానికి బలి అయి గతించిన భర్తలు కోకొల్లలు. అనాధలైన వారి భార్యలు కొందరు ఈ వృత్తి పాలయ్యేవారు. చాలా సందర్భాలలో కుటుంబంలోని దగ్గర బంధువుల పశు కామానికి ఆమె బలి అయిపోవచ్చు. తీపి తీపి మాటలు చెప్పి పెళ్ళాడుతామని ప్రమాణాలు చేసి ఆశల అందలాలు ఎక్కించి నట్టేట ముంచుతారు కొందరు మోసగాండ్రు. పొలంనుంచో లేక మార్కెట్నుంచో వస్తూవుంటే రౌడీమూకల కామదాహానికి బలి కావచ్చు. ఇక సినిమారంగంలో నలిగి పోయిన అబలలు ఇంటాబైటా బ్రతకలేక ఈ విషవృత్తిని చేపడుతున్నారు. వివాహ వ్యవస్థలోని లోపాలవల్ల, భర్తల దారుణాలకు బలి అయి మరికొందరు ఈ వృత్తిని గత్యంతరం లేక స్వీకరిస్తున్నారు. స్త్రీ పై విధింపబడ్డ విధి నిషేధాలను, విపరీతమైన ఆంక్షలను భరించలేక, ఈ వృత్తిని చేపట్టటం జరుగుతున్నది. మోయలేని కుటుంబ భారానికి గత్యంతరంలేక వృత్తిని చేపట్టేవారు కొందరు. ఇలాఎన్నో సందర్భాలలో దిగజారిపోవచ్చు. పొరపాటునకాని, మోసంవల్ల కాని, నమ్మకద్రోహంవల్లకాని, పురుషకామాగ్నికి ఆహుతి అయిన స్త్రీని 'పతిత', 'కులట' అని బిరుదులిస్తూ వికటాట్టహాసం చేసే క్రూర సమాజం మనది. పురుషదౌష్ట్యానికి బలి అయిన స్త్రీని 'చెడిపోయినది' అనే బిరుదు తగిలించి చివరకు ఇళ్ళల్లో పని మనిషిగానైనా చేర్చుకోరు మన సాధ్వీమ తల్లులు. ఆ దుష్టశక్తుల నిందలను భరించలేక నిజంగానే ఈ విషవృత్తి చేపడతారు ఆ అబలలు. ఇవన్నీ హృదయ విదారక గాథలు. ఇన్నీ తెలిసి ఆమెను నిరసిస్తారు శ్రోత్రియులు; తప్పంతా ఆమెదేనని అల్లరి చేస్తారు. ఇక్కడేవుంది విడ్డూరం.

ఇస్లాం మతానుయాయులు వేశ్యను రాళ్ళతో కొట్టి చంపుతారు. మన దేశంలో శాసనం మరోలావుంది. బహిరంగ ప్రదేశాల్లో సైగలుచేసి విటులను ఆకర్షించ ప్రయత్నించినా, వ్యభిచార గృహాలలో వుంటూ వృత్తి సాగించినా

ఆ స్త్రీకి జైలుశిక్షకూడా వేస్తారు. ఇప్పటికీ వ్యభిచారిణిని మానభంగం చేస్తే, ఆమె కేసు పెడితే, ఆమె వ్యభిచార జీవితాన్ని గురించి ముద్దాయి ప్రశ్నలు వేయించవచ్చు. అంటే వ్యభిచారిణిని ఎవరైనా మానభంగం చెయ్యవచ్చు' అనే భావం గోచరిస్తోంది. వ్యభిచారిణి అందరి సొత్తు అన్నమాట. గతిలేక ఆమె ఆవృత్తికి దిగవలసి వచ్చిందని గ్రహించరు మన సంఘపెద్దలు. అసలు ఈ మనస్తత్వం క్రింద దాగివున్నభావం ఏమిటి? వ్యభిచారాన్ని ఒక స్థితిలో నేరంగా పరిగణించే భారత శిక్షాస్మృతి 1860 లో రూపొందించబడినా ప్రజాదృష్టిని ఎందుకు ఆకర్షించ లేదు? 294వ సెక్షను ప్రకారం ఎవరైనా బహిరంగ ప్రదేశాల్లో అసభ్యంగా ప్రవర్తిస్తే, లేక బహిరంగ ప్రదేశానికి దగ్గరగా అశ్లీలపు పాటలు వగైరాలు పాడినా వారు శిక్షార్హులు. వారికి 3 నెలలు జైలు శిక్ష. ఈ సెక్షను క్రింద ఎక్కువగా వేశ్యలు మాత్రమే శిక్షాపాత్రులవుతున్నారు ఇన్నాళ్ళూ.

హిందువులలో చదువుకున్న వారలు సైతం మూడు ముళ్ళూ వేయించుకుంటారు; మంగళసూత్రం కట్టించుకుంటారు. 'వివాహితను' అని బహిరంగంగా చాటుకోటానికి ఈ సూత్రం తోడ్పడుతుంది. అంటే అవివాహితకు సమాజంలో స్థానం లేదని భయమా? ఏదో ఒక పురుషుడి ఆస్తిగా పరిగణింపబడాలనే తాపత్రయమా?

వ్యభిచారశిక్షలో కూడా ద్వంద్వనీతి ఉంది. ఇది స్త్రీ ఆత్మాభిమానానికి గొడ్డలిపెట్టులాంటిది. వేశ్యావృత్తిలోని స్త్రీ, పురుషుడూ వ్యభిచరిస్తే స్త్రీ మాత్రం శిక్షార్హురాలు! పురుషుడుకాడు. అందుకే స్త్రీల హోదాకమిటీ వారు ఇటువంటి అవమానకరమైన చట్టాన్ని మార్చాలని, ద్వంద్వనీతికి స్వస్తి చెప్పాలని సిఫారసు చేశారు.

పీనల్‌కోడ్ 497వ సెక్షను క్రింద ఎవరి భార్యతోనైనా భర్త ఎరుక సమ్మతులు లేకుండా వ్యభిచరిస్తే అతనిపై కేసు పెట్టవచ్చు. 5 సం॥ల వరకు శిక్ష విధించవచ్చు. దీనిని స్థూలంగా చదివినపుడు పురుషుడికి కూడా శిక్ష ఉందికదా; ద్వంద్వనీతి ఇంకెక్కడిది అనే సందేహం రావచ్చును. కాని జాగ్రత్తగా పరిశీలనచేస్తే అసలు రంగు బయట పడుతుంది. పీనల్‌కోడ్ రాక పూర్వం హిందూశాస్త్రం ప్రకారం స్త్రీ పురుషులిరువురూ శిక్షార్హులు. కాని

హిందూస్త్రీ అనేక ఇక్కట్లకూ, వివక్షకూ లోనవుతున్నది కనుక ఆమెకు శిక్షలేదని ఆంగ్లేయులు ఆ సెక్షనులో రాశారు. కాగా ఇప్పుడున్న నిబంధనకు వెనుక దాగిఉన్న సూత్రం ఏమిటి? 'భార్య భర్త సొత్తు. భర్త ఎరుక సమ్మతులులేకుండా ఆమెపొందును మరొకరు అనుభవించరాదు' అనేకదా! ఇది ఆధునికభావాల ప్రకారం ఎంతవరకు సమర్థనీయం? భార్యల విషయంగానే ఈ నీచభావనను ప్రదర్శించిన శిక్షాస్మృతి ఇక వేశ్యల సంగతి ఎలా పరిగణిస్తుందో మరి చెప్పనక్కరలేదు.

స్త్రీ ఒక వస్తువు; అది ఎవరికో ఒకరికి చెందిఉండాలి. వ్యభిచారిణి ఎవరికీ చెందనివస్తువు. కనక ఆ వస్తువును అందరూ అందుకొని అనుభవించ వచ్చు. ఇది స్త్రీ యెడల ఈనాడున్న న్యూనతాభావం. ఆధునిక పెట్టుబడి దారీ విధానంలో అన్నిపనులూ పరస్పర అంగీకారంమీద, కంట్రాక్టు మీద సాగుతాయికదా! రోజుకు ఇన్నిగంటలు పనిచేస్తే ఇంతకూలి ఇస్తామని కార్మికుడికి ఫ్యాక్టరి యజమానికీ ఒప్పందం జరుగుతుంది. అలాంటి ఒప్పందపు రోజుల్లో, వ్యభిచారం సాగిస్తున్న స్త్రీపై ఆమె సమ్మతిలేకుండా అత్యాచారంచేసి ఆమె పొందును అనుభవించడాన్ని చూచి చూడనట్లు ఊరుకుంటున్నది ఈ సమాజం. కనుక ఈ భావన మారితే తప్ప ఈసమస్యకు విముక్తిలేదు. వ్యభిచార వ్యాపార నిర్మూలన శాసనం **(Suppression of Immoral Traffic Act)** అనేది 1956లో తయారయింది; అమలులో ఉంది. ఏటా కొన్ని వేలమంది స్త్రీలకు ఆ శాసనం పేరుతో జైలుశిక్షవేస్తూ తన పవిత్రతను కాపాడుకుంటున్నది సమాజం. ఈ మధ్య వ్యభిచార నిర్మూలన సమస్యపై ఢిల్లీలో పెద్ద సదస్సు జరిగింది. 300 కు పైగా వివిధ దేశాలనుండి ప్రతినిధులు వచ్చారు. సూచనలు చేశారు; ప్రణాళికలు తయారుచేసి వెళ్ళారు. 1875 లోనే 'అంతర్జాతీయ వ్యభిచార నిర్మూలనా సంస్థ' ఏర్పడినా ఈనాటికీ అడుగుముందుకు వేయలేదు. ఆ సంస్థ ఉన్నట్లు కూడా చాలామందికి తెలియదు.

ఆర్థిక స్థిరత్వం స్త్రీలలో పాదు చేసుకుంటే తప్ప ఈ వృత్తి నశించదు. స్త్రీలకు విద్యా ఉద్యోగావకాశాలు భారీ ఎత్తున విస్తరింపచేయాలి. వ్యభిచార వృత్తిని మనం ప్రోత్సహించం; కాని, మతస్తులచేత తరతరాలుగా

చెప్పబడిన నీతులకు బలి అయిపోయిన అభాగినులను శిక్షించేహక్కు సమాజానికి లేదని మనం వాదించాలి. స్త్రీని వేశ్యగా తయారు చేసి వాడుకున్నవాడు పురుషుడే. పురుషుని శృంగార తృష్ణకు మార్గంగా ఈ వృత్తిని వాడుకునే పురుష పుంగవులను సమాజం వెలివేయాలి; దూషించాలి ఆర్థికంగా భద్రత లేక, సామాజికంగా రక్షణ లేక, వ్యవస్థలోని లోపాలవల్ల ఆమె ఎదురు తిరగలేక లొంగిపోయింది. అలాంటి వారిని ఆ స్థితిలో ఉంచటం అన్యాయం; అక్రమం: అనాగరిక లక్షణంకూడాను. సంఘ సంస్కర్తలూ, సంఘసేవకులూ ఈ వృత్తి నిర్మూలనకై స్త్రీ జాతి లో జాగృతిని చైతన్యాన్ని కలిగించాలి. బృహత్తర పథకాలతో, సేవా దృక్పథంతో, బాధ్యతతో వేశ్యలకు పునరావాస సౌకర్యాలు కలుగజేసే పని చేపట్టే తప్ప ఈ వృత్తి నిర్మూలనం కాదు.



ఆడపుట్టుకతో తల్లినే నిందిస్తారు. దీనికి బాధ్యులెవరో తెలుసా? స్త్రీపురుషులిద్దరిలో క్రోమోజోమ్సువుంటాయి. పురుషుని స్పెర్మ్‌తో రెండు రకాల క్రోమోజోమ్సువుంటాయి. స్త్రీఅండంలో XY అనే ఒకే రకమైనక్రోమోజోమ్సు వుంటాయి. పుట్టబోయే శిశువుకు తల్లినుండి ఒకటి తండ్రి నుండి ఒకటి కావాలి. రెండూ లభిస్తే ఆడపిల్ల XY లభిస్తే మగబిడ్డపుడతాడు. తల్లి X మాత్రమే ఇస్తుంది. తండ్రిX లేకY ఇస్తాడు. దీనినిబట్టి బిడ్డ Sex నిర్ధారణ అవుతుందిగదా! మరి స్త్రీని నిందించట మెందుకో!

# స్త్రీల హోదా

స్త్రీ ఒక వ్యక్తిగా పుట్టిందికాని ఒకనికి భార్యగా పుట్టలేదు. 70% నిరక్షరాస్యులున్న ఈ వ్యవస్థలో ఆడదంటే అందరికీలోకువే. ఆమె కూడా మనిషేనని ఆమెకూ ఆలోచనలు, అభిప్రాయాలు వుంటాయని గ్రహించలేని ఈ పురుషజాతికి అసలు బుద్ధిమాంద్యం వున్నదనేది నగ్నసత్యం ముఖ్యమైన భావవికాసం, శాస్త్రీయ దృక్పథం మగవారిలో మృగ్యం కాబట్టే తాము అధికులమని, యజమానులమని, భరించే వారమనే దురభిప్రాయాలు పొందుచేసుకొన్నాయి ఆ తిరోగమనవాదుల్లో ప్రజాస్వామ్యం. స్వాతంత్ర్యం, సమానత్వం అంటూ గంటలకొద్దీ ఉపన్యాసాలు దంచేస్తారు. తీరా తమ పార్టీలో, ఉద్యమంలో త్యాగాలు చేసిన మహిళలను సైతం విస్మరిస్తారు; అక్కడి కొచ్చేసరికి కప్పదాటేసి ఏవో బిచ్చంపెట్టినట్లు ఒకటో అరో పారేస్తారు. హరిజనోద్ధరణ, కార్మిక జనోద్ధరణ, అస్పృశ్యతా నివారణ లాంటివాటిని సాగించే సంస్కరణవాదులు సైతం స్త్రీజనోద్ధరణ అంటే పెదవి విరుస్తారు; విరుచుకు పడతారు. ''మీకిప్పుడే మయిం''దని ఆక్షేపిస్తారు.

అసలు ఆడవాళ్ళకంటూ కొన్నిపనులు నిర్దేశించటంలోనే తేడాలు చూపిస్తారు. వారిని అవమాన పరిచే పదజాలం వాడుకలో అసంఖ్యాకంగా వున్నాయి. 'మగరాయుడిలా 'ఏమిటాతిరగటం?' అబద్ధాలు ఆడితే ఆడపిల్ల పుడుతుంది, ఆడదానినోట్లో నువ్వుగింజదాగదు, 'ఆడదానిలా' గాజులు తొడుక్కొని కూర్చో, 'ఏమిటోయ్, ఆడవేషాలూ నువ్వూనూ,' ఉద్యోగం పురుషలక్షణం, ఆడది చదివి ఉద్యోగం చేస్తుందా? ఊళ్ళేలుతుందా? "ఆడదానిలా ఏడవకూ!" ఇలాంటి సూక్తులు ఏన్నో! ఇలా చులకన భావం ప్రదర్శించే మాఅన్నతమ్ములను మేముమాత్రం ఆరాధించాలి;గౌరవించాలి; పొగడాలి, బాగుందీవరస. ఏ తల్లి ఒడిలోనుండి, ఎవరిచేతుల్లో పెరిగి పెద్దవాళ్ళవుతారో ఆ తల్లుల్ని అజ్ఞానంలోముంచి, అవమాన పరచటంవల్ల ఆ నష్టం కేవలం ఆడవాళ్ళకే కాదు; సమాజం అంతా నష్టపోతుంది. ఏ ఆడదయినా హక్కులకై పోరాడితే గుండెలు బాదుకుంటారు. ఇదంతా

మీరు కల్పించుకున్న అపోహ, పక్షపాతధోరణి తప్ప ఆడా-మగా తేడా ప్రకృతే సృష్టించింది. ఇద్దరూ సమానులు ఎలా అవుతారు? హాయిగా చక్కని నీడలో తలదాల్చుకొని వంటావార్పుచేస్తూ పిల్లల్నికని పెంచితే చాలదా? 'లతాంగి' అనేపేరు ఎందుకొచ్చింది? ఆడదాని కున్నపవిత్ర స్థానాన్ని, భార్యభర్తలమధ్యవుండే పవిత్రబంధాన్ని త్రెంచి అల్లకల్లోలాన్ని సృష్టిస్తున్నారు. మీ కంఠశోషవల్ల అశాంతి, అలజడి చెలరేగి ప్రశాంతంగా వుండే కుటుంబం విచ్ఛిన్నమయిపోతోంది. సామాజిక ప్రగతి సర్వనాశన మవుతోంది. మీరు స్త్రీలను రెచ్చగొట్టి పోటీతత్వాన్ని వారిలో నూరి పోస్తున్నారు. వారి చేత మా మీద తిరుగుబాటు చేయిస్తున్నారు. ప్రశాంత వాతావరణంలో జంఝామారుతాన్నిరేపి అశాంతి కలిగిస్తున్నారు. మీ విష ప్రచారంవల్ల మీరేనష్టపోతారు. మీ మీద మాకున్న పవిత్రభావం నశిస్తుంది. మీరు స్వేచ్ఛా, సమానత్వం, హక్కులు గట్రా అంటారా? ఎన్నిహక్కులు కావాలన్నా అన్నీ చట్టాల్లో వుండనే వున్నాయి. ఇక మాజోలికిరాకండి. అంటూ చివరికి ఎగతాళిగా నవ్వేసి వూరుకుంటారు. ఇదంతా స్త్రీలపై మగ వారికి, సమాజానికివున్న న్యూనతాభావం. ఇదీ ఈనాటి స్త్రీహోదా! కాదంటారా?రుజువు చెయ్యండి! మరి అవునంటారా! తిరుగుబాటు చెయ్యండి. మరి ఆలోచిస్తారా? ఇక సెలవు?



"పురుషుని క్రిందలొంగివుండటం ఇష్టంలేక పెళ్ళిమానుకున్న స్త్రీలు, తమ ఆదర్శానికి తగినంత ఔన్నత్యంగల పురుషులు దొరక్క పెళ్ళాడని స్త్రీలు, ఏవో ఆదర్శాలు అభిరుచులుఖండి భర్తకీ పిల్లలకీ ఇవ్వటానికి వ్యవధిలేక పెళ్ళిమరచిపోయిన స్త్రీలు వుంటారని సంఘం కలలోనైనా ఆలోచించదు"

— చలం.

# నేటి స్త్రీల సమస్యలు

నిర్బంధం మనిషికి సంకుచితత్వాన్ని ఇస్తుంది. స్వేచ్ఛ మనిషికి సంస్కారాన్ని ప్రసాదిస్తుంది. అలాంటి స్వేచ్ఛ మహిళాలోకానికివుందా? ఏ స్త్రీ అయినా స్వేచ్ఛకోరితే ఆమెను బరితెగించినదానిగా, రోడ్డున పడ్డదానిగా, మాయావిగా, భ్రష్టగా, ఒక తిరుగుబోతుగా, రాక్షసిగా వర్ణిస్తారు. ఆ స్వేచ్ఛకూ, ఆమె సెక్సు జీవితానికీ సంబంధం అంటగడతారు. పురుషుడి హక్కు లెప్పుడూ ఆచరణలో సులభసాధ్యం అవుతాయి. అవివారి జన్మ హక్కుగా పరిగణిస్తారు. చట్టాలలో పొందుపరచినవి అయినా, అవి స్త్రీలు కోరితే పెద్ద సంచలనాన్ని సృష్టిస్తుంది; దానికి విపరీతార్థాలు కల్పిస్తూ వింతకథలు సృష్టిస్తారు. ఒకహక్కు అనేది మనకున్నప్పుడు, దాని అవసరం మనకు కలిగినప్పుడు (ఏవిడాకులతో, ఏ వారసత్వమో) ఎవరో ఆక్షేపిస్తారని భయపడివుండటం అవివేకం; అజ్ఞానంకూడాను. అసలు హక్కులనేవి అవసరం కలిగినప్పుడు వాడకపోతే అవినశిస్తాయి; వాటికి విలువవుండదు: అవి తుప్పు పట్టి రాలిపోతాయి.

నేటి వనితలు ఎదుర్కొంటున్న సమస్యలు అనంతంగావున్నాయి; అపరిష్కృతంగా మిగిలి పోతున్నాయి. చెప్పాలంటే ఒక ఉద్గ్రంథమవుతుంది. ఆధునిక పరికరాలు, అధునాతన సౌకర్యాలు వేషభాషలుచూచి స్త్రీ లేదో పురోగమించారను కొనుట భ్రమ. అది సంస్కృతికి, నాగరికతను భేధంతెలియని అజ్ఞానం, అవివేకం అనక తప్పదు.

యక్షప్రశ్నలకన్నా జటిలమైనవి, అతిక్లిష్టమైనవి స్త్రీల సమస్యలు. అవిచిక్కుపడిన దారపువుండలా కంటికికనపడవు; మేడిపండులా కప్పి పుచ్చుతాయి. ఆర్థిక, సాంఘిక, రాజకీయ సాంస్కృతిక రంగాలలో స్త్రీకి స్వేచ్ఛాలేదు, సమానత్వం అసలేలేదు. కుటుంబ పరంగా, దాంపత్య విధానంలో, శరీరరక్షణలో, సంతానంకనుటలో విద్యలో, ఉద్యోగంలో ఆఖరికి ఉనికి విషయంగా కూడా స్త్రీ పురుషులలో హెచ్చుతగ్గులు ఏపరిధిలో వున్నయో ఉదాహరణలతో పరిశీలిద్దాం.

వ్యక్తి స్వేచ్ఛగా మనుగడ సాగించాలంటే ముఖ్యమైనది డబ్బు. పురుషుడితో సమానమైన ఆస్తి హక్కు అంటే హిందూ లా ప్రకారంవున్న పిత్రార్జితపు ఆస్థిలో కుమారునకు పుట్టుకతో హక్కు స్త్రీకి చట్టరీత్యాకూడాలేదు. ఆమెపేర ఏదయినా ఆస్తివున్నాదానిపై అనుభవం, అధికారం, భర్తదే అవుతున్నది. ఆఖరికి అమ్ముకోవాలన్నా నిర్ణయించేది భర్తయే. ఇద్దరూ కలిసి సంపాదించిన ధనంతో ఇల్లు, పొలంలాంటి ఆస్తులు భర్త పేరనే కొంటారు. భార్య పొదుపరితనం అసలు లెక్కలోకేరాదు. ఆమె చాకిరీకి అసలువిలువే లేదు. ఇది ఆస్తిపరమైన దోపిడీకాదా? ఆర్థికంగా వనరులు లేని భార్యను భరించేవాడు "భర్త" అన్నారు.

ముఖ్యమైనది మన సామాజిక జీవనం. ఆడపిల్లను కన్నతల్లి దురదృష్టవంతురాలిగాను, మగవాణ్ణి కన్నతల్లి అదృష్టవంతురాలిగాను చూడటం అసమానత్వానికి మొదటి చిహ్నం తల్లిదండ్రుల పోషణాభారాన్ని, వారి బాధ్యతలను పుత్రుడే భరించాలనడం, కుమార్తె చేస్తానన్నా ఆమె తల్లి దండ్రులు కాదనడం, భర్త వ్యతిరేకించటంలోనే హెచ్చు తగ్గులు దృగ్గోచరించటం లేదా? అందులో స్త్రీ పురుషభేధంలేదా!

ఇక స్త్రీ వునికి గురించి చెప్పాలంటే భర్తకు ఏనాడు కోపమొస్తే ఆనాడు పోవాలి. భర్త విడాకులు పొందకున్నా వేరొక స్త్రీని భార్య అని చెప్పుకోవచ్చు. స్త్రీ ఉద్యోగం చెయ్యాలంటే భర్త అనుమతితోనే చెయ్యాలి వద్దంటే విధిగా మానాలి. తనకన్నా హోదా, ఆదాయంవున్న భార్యల్ని ఉద్యోగం మాన్పించిన కేసులెన్నో వున్నాయి. అది 'సుపీరియారిటీ కాంప్లెక్సు'గా భావిస్తాడు. ఒక వ్యభిచారం జరిగినప్పుడు "అది చెడింది"అని గర్హించిన సమాజం వాడికేంలే మగాడు అంటూ ద్వంధనీతి ప్రకటిస్తుంది. భర్త ఇష్టప్రకారమే పిల్లల్ని కనాలి. తనసంతానానికి భర్తేగార్డియన్‌గా వుండాలి. వివాహానంతరం భర్త ఇంటిపేరే ఆమె విధిగా వాడాలి. భార్యను కొట్టినా, చంపినా సమాజం ఉలకదు, పలకదు. వివాహ ఎన్నికలో పురుషుడిదే పైచేయిగా వుంటుంది. వదువుమాత్రం రంగులు వెలిసిన పేడబొమ్మలా నుంచుంటుంది ఎవరు కొంటారా అని ఎదురు చూస్తూ. స్వయంవరంలో నెగ్గిన వాడే భర్త అన్నా, పోరాటంలో గెలిచిన వీరుడే

మగడన్నా తలపూపాల్సిందే; నీ ఆజ్ఞలకు లోబడివుంటానని పెళ్ళినాడే ప్రమాణంచెయ్యాలి. ఉద్యోగినితెచ్చే జీతం అంతా భర్త దోసిట్లోపోసి బస్సుచార్జీలకు యాచించే భార్య లెందరున్నారో తెలుసా? భార్య తన 'కోలీగ్' తో కాఫీతాగినా సహించలేని అసహనం వున్న భర్త లెందరో! ఇలా చెప్తుంటే ఎన్నో! మరెన్నో!!

ఇక రాజకీయంగా చూస్తే 500 పైగా సభ్యులున్న పార్లమెంటులో 19 మంది స్త్రీలే ఉన్నారు. అలాగే రాష్ట్ర అసెంబ్లీ 294 లో 11 మంది స్త్రీలున్నారు. ఉపాధ్యక్షు లెక్కడా దేశం మొత్తంలోలేరు. ఏ క్యాబినెట్‌లో స్త్రీలుండటం అరుదు. ఈనాడు ధనం, కులం. పరపతి లేనిస్త్రీ ప్రజాప్రతినిధిగా నిలబడగలదా! నెగ్గగలదా! అదిలేని దేశశాసనాధికారం వుండదుగదా! అలాంటప్పుడు చట్టాలనెలా అమలుచేస్తారు? చట్ట నిర్మాణంలో స్త్రీల ప్రమేయమే దుర్లభమవుతోంది. హోదాగల పదవులన్నీ పురుషపరమే అవుతున్నాయి. శాసనాలన్నీ పురుషులే చేశారు. చట్టాలన్నీ తమకు అనుకూలంగా వుంచుకుంటారు. రానురాను రాజకీయాలకు ఇంకా దూరమవుతున్నారు స్త్రీలు.

ఇక సాహిత్యంలోనూ, సినిమాలలోనూ స్త్రీ భర్తకు ఎంతగా దాసోహం అంటే అంత పతివ్రత అంటారు. సినిమాల్లో స్త్రీని కేవలం వినోదవస్తువుగా చిత్రించటం పరిపాటి అయింది. ఇలా అన్ని రంగాలలో స్త్రీలు అనేక పరిమితులకులోనై ఏదోఒక మగదిక్కు రక్షణలో బ్రతుకు తున్నారు. ఈపరిస్థితికి భిన్నంగా కొన్ని మౌలికమైన మార్పులురావాలి.

మతానికిగాని, సంప్రదాయానికిగాని, రాజ్యానికీగాని ఆఖరికి కన్నతండ్రికైనా స్త్రీ స్వేచ్ఛను అరికట్టేందుకు, ప్రశ్నించేందుకు హక్కులేదని నమ్మాలి. ముందుగా స్త్రీ ఆర్థికంగా ఆధారపడి జీవించే దుస్థితి పోవాలి. పరిపాలనాది కీలకస్థానాలలో, చట్టాల నిర్మాణంలో స్త్రీల ప్రాతినిధ్యం వారి నిష్పత్తిలో పెరగాలి, విద్యాస్థాయి, ఉద్యోగాల సంఖ్య పెరగాలి. సాంఘిక దురాచారాలు, మూఢవిశ్వాసాల నుండి స్త్రీలు బైటపడాలి. స్త్రీలు తమ అస్తిత్వాన్ని తెలుసుకుంటే చాలదు. తమ హక్కుల కొరకై విప్లవాలద్వారా

నైనా పోరాడాలి. మానసిక ఐక్యత రావాలి. ముందుగా స్త్రీలు మానసిక దాస్య విముక్తికై తపనపడాలి. స్త్రీలను తమ సహచరులుగా, స్నేహితులుగా భాగస్వాములుగా గ్రహించగల మనఃప్రవృత్తి పురుషులలో కలిగిననాడు నిజమైన స్త్రీ విముక్తికి మార్గం సుగమ మవుతుంది.

చిత్తశుద్ధి, నిస్వార్థసేవా దృక్పథం, సంస్కరణాభిలాషా గలవ్యక్తులు ముఖ్యంగా స్త్రీలు ముందుకొచ్చి స్త్రీ విమోచనోద్యమాలకు సారథ్యం వహించాలి. స్త్రీలలో సంస్కరణాభిలాష, స్వేచ్ఛా పిపాస, సత్యాన్వేషణా కలిగించే వ్యక్తులు ముందురావాలి.

(o) ● (o)

మానవత లేని హేతువాదం నిస్సారం; హేతుత్వప్రాతిపదిక లేని మానవత నిరర్థకం.

వివిధశాఖల్లో విజ్ఞానంకల వ్యక్తులు రాజకీయాలకు దూరమవుతున్నారు; అలాంటివారు రాజకీయాలలో పాల్గొన్నపుడే సమాజం సుసంపన్నం అవుతుంది.

# ప్రగతి పథంలో స్త్రీ

'నేటిస్త్రీ ప్రగతి పథంలో ఎంతవరకు ప్రయాణం సాగించింది?' అంటే నాగరికతాప్రభావంవల్ల బానిసత్వం నుండి 'షోకేసులో' బొమ్మలా తయారయిందని చెప్పకోవటం హాస్యాస్పదంకాదు. అసలు ప్రగతి అంటే పదిరంగుల చీరెలుకట్టి పంచరంగుల చిలకలా పంజరంలో తిరగటంకాదు. స్త్రీల ప్రగతి కేవలం వేష భాషల్లోకాదు 'వారి వ్యక్తిత్వంలో, సంస్కృతిలో మార్పుకోరుతున్నారా?' అనేది ముఖ్యమైనప్రశ్న 'బహురూపాల్లో దర్శన మిచ్చే శారీరక, మానసిక, ఆర్థిక, రాజకీయ సాంస్కృతిక స్వేచ్ఛలు స్త్రీల కున్నాయా' అనేది మరొక ప్రశ్న. సంరక్షకత్వంవల్ల మగువల ఆర్థిక స్వేచ్ఛ వమ్మగుట లేదా? 'అనేది చర్చనీయాంశంకాదా?' తరతరాల బానిసత్వానికి, సంకెళ్ళకూ అలవాటుపడ్డ మహిళలు విముక్తికై ఆరాట పడుతున్నారా? లేక తమ బంగారు సంకెళ్ళకు తామే మురిసిపోతున్నారా?' అనేది ఆలోచించకతప్పదు.

యుగయుగాలుగా అజ్ఞానంలో, అనేక ధర్మాల చట్టంలో బిగింపబడ్డ మహిళ రక్తంలో, స్వభావంలో, అనేక రుగ్మతలు ప్రోదిచేసుకున్నాయి. అందులో ముఖ్యమైనది తాను ఏదోఒక పురుష దక్షతలో, మగనీడలో జీవితాంతం పడివుండాలనే భావం. మహిళలు కోట్లసంఖ్యలో పురుషాధిక్యతను సూటిగా స్వీకరించి వారి అదుపు ఆజ్ఞల్లో మసులుతూ తమ ఆశల్ని, ఆశయాల్ని, కోర్కెలనూ అణగార్చుకుంటున్నారు. వారు తమ భర్తల అత్యాచారాలను, ఆనందంతో సహిస్తూ వారి దయాధర్మాలమీద తమ జీవితాలను గడుపుకుంటున్నారు. ఎందరో అబలలు అంగడిబొమ్మలుగా, సంతలో వస్తువులుగా దుర్గంధ భూయిష్టమైన జీవితాలను గడుపుతున్నారు. అదే మన సంస్కృతి అని, అది చాలా పవిత్రమైనదని మనలను మనము పొగుడుకుంటున్నాం. అది అంతరంగిక మాలిన్యం అని తెలియని అయోమయ అవస్థే మన దుర్గతి. అంతరంగిక మాలిన్యాన్ని క్షాళనం చేసుకోవాలి గాని దానిపై పన్నీరు చల్లితే అంతరంగంలోనికుళ్ళు విషమించి మనల్ని దిగమ్రింగే ప్రమాదముందని గ్రహించాలి.

మనలోవున్న అర్ధరహిత సంప్రదాయాలు, వ్యవస్థీకృత మూఢ విశ్వాసాలు మార్చాలన్నా, ఆధునికమార్గాన మనం పయనించాలన్నా సమూలమైనమార్పును. కోరే ఒక ఉద్యమాన్ని మనం నిర్మించుకోవాలి. ఆ ఉద్యమాన్ని ప్రతిఘటించేఛాందసవాదులు మనపై విజృంభిస్తారు. అప్పుడు మనం స్థిరచిత్తంతో, ధైర్యస్థయిర్యాలలో, త్యాగాలతో ఎదుర్కొంటేనే ఆఉద్యమం ఫలించిమార్పు తెస్తుంది.

ఇంతవరకూ జరిగిందంతా స్త్రీల మారణహోమం. అంటే సతిగా చితిలోదూకింది. అమ్మితే అమ్ముడుపోయింది. పవిత్రతకోసం అగ్నిశిఖలలో దూకింది. వేదవిద్యకు అనర్హురాలవంటే తలవంచింది. ఆస్తిహక్కులేదంటే తలూపింది. నీ మొగుడికి కట్నమిచ్చి నీకన్నెచెరదింపుకున్నామంటే దిష్టి బొమ్మలా నిలబడ్డది. నీ బిడ్డలకు గార్డియన్‌వి నీవు కావాలంటే సరేనన్నది. నీవు గొడ్రాలివు నిన్ను విడుస్తానంటే కిమ్మనలేదు. పాపలాబట్టకు, పదిపైసల పూలకు ఆధారపడి జీవించే దిక్కుమాలిన ప్రాణివంటే కాదనలేదు. నీతండ్రి నా దోసిలినింపలేదు; నిన్ను కాలుస్తా, నరుకుతానంటే కళ్ళు అద్దుకుంది చీర కొంగుతో. ఇలా ఎన్నో....మరెన్నో....ఇంకాఎన్నో.... ఏమని చెప్పాలి!

కాలం, పరిస్థితులు, నాగరికత, శాస్త్రజ్ఞానంపెరిగింది. నేటిస్త్రీ తప్పటడుగులు వేస్తూ ప్రగతి పథంలో పయనిస్తానంటోంది. స్వాతంత్ర్యానికి పూర్వం మహిళాభ్యుదయానికి జరిగిన కృషి అత్యల్పం. తర్వాత రాజ్యాగం స్త్రీకి సమానహోదా, రాజకీయ, ఆర్థిక సమానత్వం కలిగించింది. స్త్రీ విద్యా ఉద్యోగాలకు కొంత అవకాశమిచ్చింది. ప్రగతి పథంలో స్త్రీకి రాచబాటలకు ప్రాథమిక చర్యలు తీసుకోవడం జరిగింది.

"నేటిస్త్రీ ప్రగతిపథంలో పయనిస్తోందా? ఎంతవరకు? ఏఏరంగాలలో" అనేవి కొన్ని శేషప్రశ్నలున్నాయి. "చట్టాలవల్ల కట్నాలుపోవు" అన్నట్లు శాసనాలు మాత్రమే స్త్రీల ప్రగతి సౌధానికి మూల స్థంభాలుకావు. దానికి అనుగుణమైన వాతావరణం కావాలి, పరిస్థితులు అనుకూలించాలి. పురుషుల తోడ్పాటు కూడా అవసరం. ముఖ్యమైనది స్త్రీలలో భావసంచలనంవుండాలి. పట్టుదల; ధైర్యం, ముందుచూపు మానసికవికాసంవుండాలి. స్త్రీలలో ఐక్యతా

భావం వీటి అన్నింటికి మూలంకావాలి. కేవలం పురుషద్వేషంతో మహిళా సమస్యలు సమసిపోవు. అదివారి ప్రగతికి మార్గంకాదు. భావవికాసం, శాస్త్రీయ దృక్పథం, ఆలోచనాశక్తి స్త్రీలలో చోరవచేసుకోవాలి.



స్వేచ్ఛ మన ఆదర్శం, మన లక్ష్యం; సత్యాన్వేషణ దానికి సాధనం.

ఎవరుచేసినా మంచి పనిని హర్షించగలగాలి; నేను చేస్తేనే అదిమంచి అనుకోవడం దురహంకారం.

నేనుచేసే ప్రతిపనీ పొరుగువాడికి ఉపయోగపడుతున్నదా అనేదే మానవ నడవడికి గీటురాయి కావాలి.

# మీకేం! ప్రధానమంత్రి మహిళేకదా!

"నాదేశానికి అర్ధరాత్రి స్వరాజ్యం వచ్చింది కాని, ఇంకా తెల్లవారనే లేదు" అన్నట్లుంది ఈదేశ స్త్రీ జనాభ్యుదయం. తెల్లారేసరికి స్త్రీలపై అత్యాచారాలు, హత్యలు, ఆత్మహత్యలు, కాల్చిచంపటం, కాల్చుకొని చావటం లాంటి దుర్వార్తలు లెక్కకు మిక్కుటంగా వుంటున్నాయి. వరకట్న దురాచారానికి బలి అయ్యే అబలల సంఖ్య వర్ణనాతీతం. అదిచాలక స్త్రీలే అధినేతలయి దేశరథసారథ్యాన్ని వహిస్తున్నట్లు పరిపాలనాదక్షులై చక్రాన్నివారే త్రిప్పుతున్నట్లు "మీకేమండీ! ప్రధానమంత్రి మహిళ; రాజ్యం చేస్తున్నది. మీరేగదా" అని అంటున్నారు పురుషులు. ఎగతాళిగా తీసుకుంటే ఈమాటలు సొంపుగానే వుంటాయి. కాని వాటిని సరిగా అర్థంచేసుకుంటే మహిళలకు చాలా మనస్తాపం కల్గుతుంది.

ఒక స్త్రీ ప్రధానమంత్రి, మరొక స్త్రీ ముఖ్యమంత్రి, వేరొక మహిళ హైకోర్టు జడ్జి అయినంత మాత్రాన దేశంలో 50% మహిళా ప్రపంచానికి ఒరిగేదేమీ లేదు. స్త్రీల స్థితిగతుల మెరుగు పడ్డాయా లేదా అనేదే నేటిముఖ్య సమస్య. ఈ అంశాన్ని తరిచి చూడటం మహిళోద్యమ కార్యకర్తలకు, సామాజిక శాస్త్రజ్ఞులకు అవస్య కర్తవ్యం.

సమాజంలో పెద్దలుగా, నాయకులుగా చలామణీ అవుతున్న చాలా మంది రోటరీ, లయన్సు క్లబ్బుల్లో సభ్యులుగా వుంటున్నారు. మీటింగు చివర్లో సభకు స్త్రీలు మంచి అందాన్ని చేకూర్చారని, సభ మంచి కలర్‌ఫుల్‌గా వుండటానికి కారణం స్త్రీలు పాల్గొనడమేనంటూ స్త్రీలకు ధన్యవాదాలు చెప్తారు. ఈ మాటలవల్ల స్త్రీ కేవలం అలంకారవస్తువేఅనేభావం స్పష్ట మవుతుంది.

తమ భార్యలను గృహలక్ష్మిలుగా పేర్కొంటారు అనేక మంది. దాని భావమేమిటి? నాల్గుగోడలమధ్య ఇంటి ఆవిడ పెత్తనం చెయ్యవచ్చును. కాని గడపదాటి బైటికి పోరాదు. సామాజిక కార్యక్రమాలలో; రాజకీయ భాగస్వామ్యంలో వారికి స్థానం ఇవ్వరు. ఇది స్త్రీల యెడ పురుషులు ప్రదర్శించే మరియొక వింత వైఖరి.

ఒక వేళ కొంతమంది స్త్రీలు ధైర్యంగా విద్యార్హత సంపాదించుకొని ఉద్యోగాన్ని ఆశిస్తే, తమకు పోటీగా ఉద్యోగపు మార్కెట్‌లోకి స్త్రీలు చొచ్చుకొస్తున్నారని ఫిర్యాదుచేస్తూ వారిని ఈసడిస్తున్నారు పురుషులు.

ఒకానొక సందర్భంలో ఏ స్త్రీ అయినా చొరవచూపించి సామాజిక, రాజకీయ కార్యక్రమాల్లో పాల్గొనడానికి సాహసిస్తే ఆమెకు తగిన స్థానం ఇవ్వకపోవటమేకాక స్త్రీలను చిన్నచూపు చూస్తారు. ఒక వేళ శాసనాన్ని పాటించవలసివచ్చి, విధిలేక పంచాయతీరాజ్ లాంటి వ్యవస్థలో చోటు ఇవ్వ వలసివచ్చినా అదేదో దయతలిచి స్త్రీలకు ఆ స్థానాలిచ్చినట్లు పురుషులు భావిస్తున్నారు.

స్త్రీలు అజ్ఞానంతో కొట్టుమిట్టాడుతున్నారనీ, అందువల్ల వారు సామాజిక కార్యక్రమాల్ని నిర్వహించలేరనీ చాలామంది పురుషులు పనిగట్టుకొని ప్రచారం చేస్తున్నారు. మొత్తంమీద స్త్రీలలో అవిద్య మెండనేది నగ్న సత్యం; కాని దానికి కారకులెవరు? ముమ్మాటికీ పురుషులే. మహిళలకు విద్యా, విజ్ఞానాలు లేకుండా ఇళ్ళల్లో గొడ్డుచాకిరీ చేయించుకునేది పురుషులు కాక మరెవ్వరు? ఇదంతా కపటం, పచ్చిమోసం కాదా?

ఇలా పురుషులు స్త్రీలను అలంకార వస్తువులుగాను, రెండోరకం పౌరులుగాను, శక్తి యుక్తులులేని వ్యక్తులుగాను పరిగణిస్తూ వారియెడల జాలి, కోపం, ఈసడింపు, నిరసనలాంటి వివిధ వైఖరులను ప్రదర్శిస్తున్నారు. ఇలా చెప్పినంత మాత్రాన పురుషద్వేషాన్ని పెంపొందిస్తున్నామని మాత్రం అనుకోవటం అవివేకం అవుతుంది. వాస్తవాలను కప్పిపుచ్చటం ఘోరమైన తప్పిదం అవుతుంది. కనుక ఇలా చెప్పాల్సి వస్తుంది.

ఒకరకంగా ఆలోచిస్తే అధిక సంఖ్యాకులైన పురుషులు ప్రస్తుతం అమల్లోవున్న దోపిడీ వ్యవస్థకు బానిసలుకాగా స్త్రీలు రెండురకాలుగా బానిసత్వంలో వున్నారు. అన్యాయంతోను, అసమానత్వంతోను తొణికిసలాడే సమాజానికి ఒకవైపు, పురుష ప్రపంచానికి మరోవైపున కట్టు బానిసలుగా స్త్రీలు జీవయాత్ర సాగిస్తున్నారు.

ఇంతకూ స్త్రీలకు స్వరాజ్యానంతరం ఏమి లాభించింది? కాస్తో కూస్తో అభ్యుదయం లేక పోలేదు. కాని ఇటీవల మనదేశంతోపాటు స్వ రా జ్య ం సంపాదించుకొన్న చైనాలాంటి దేశాలతో పోల్చుకుంటే మనది నత్తనడక అని చెప్పక తప్పదు. విద్యారంగం, ఉద్యోగ అవకాశాలు, వైద్యసౌకర్యాలు లాంటి వసతులు మహిళలకు అత్యంత దుర్లభంగా వుంటున్నాయి, ఇక అత్యంత ప్రముఖమైన సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో, కుటుంబంలో స్థానం ఇలా ఒక్కొక్క అంశంగా విడమరిచి పరిశీలిస్తే మన అభ్యుదయం స్త్రీలకు సంబంధించి అత్యల్పం. ఈ పరిస్థితులకు కారకులెవరు? పాలకులా? రాజకీయ పార్టీల నాయకులా, పురుష ప్రపంచమా? లేక స్వయంకృషితో తమ అభ్యుదయానికి తాము పాటుపడని మహిళాలోకమా? ఈ ప్రశ్నలకు సమాధానం సరిగా ఇవ్వగలిగితే సమస్య సగం అర్థం అయినట్లే.

—

సమాజంలో సగం మందియైన స్త్రీలు దుఃఖ భాజనులయితే ఆ సమాజానికి ప్రగతి లేదు.

• • •

మానవ సంస్కృతికి ఎల్లలులేవు; అది దేశ, మత, జాతి, కాలావధులు దాటి ప్రవహిస్తుంది.

# సంఘసేవ ఈనాడు సాధ్యమా?

సంఘసేవ ఎందుకు చెయ్యాలి? ఎవరికి చెయ్యాలి? ఎలా చెయ్యాలి? అనేవి కొన్ని ప్రశ్నలయితే అసలు సంఘసేవ ఈనాడు సాధ్యమా? అనేది మరో ప్రశ్న అయింది. సమాజ ఆవిర్భావం నుండి సమస్యలు ఉంటూనే వున్నాయి. సంఘసేవకులు వ్యక్తులుగాను, సంఘాలద్వారాను సహాయం చేస్తూనేవున్నారు. అయితే అనాటి సమస్యలు వేరు. ఈ నాటి సమస్యలు వేరు. ఈనాటి సమస్యలు చాలా క్లిష్టతరం కావటంవల్ల వాటి పరిష్కారమార్గాలు కూడా అంత కష్టంగానూ వుంటున్నాయి. ఈనాడు సమాజ సేవకు వున్న ఇబ్బందులేమిటో తెలిసికొంటే తర్వాత వాటిని ఎలా అధిగమించగలమో చర్చించుకుందాం.

ఈ సమాజం ఎలాపోతేనాకేం నేనూ నాకుటుంబం బాగుంటేచాలు ననే నిర్లిప్తతా భావం కలవారి సంఖ్య రోజు రోజుకూ పెరుగుతోంది. ఈ పని చేస్తేనాకేమి లాభిస్తుంది అనే చూపుతప్ప ఈ పనివల్ల సమాజానికేమి ఉప యోగముంటుంది అని ఆలోచించే వారున్నారా? అనిపిస్తోంది. సేవా దృక్పథం కలవారు బహుఅరుదుగా కనపడుతున్నారు. సామాజిక స్పృహతో ఆలోచించే వ్యక్తులు కరువవుతున్నారు. సమస్యలు మాత్రం విపరీతంగా పెరుగుతున్నాయి. తెల్లారేసరికి మానభంగాలు, అత్యాచారాలు, కొట్టటం, చంపటం, కాల్చటం లాంటివి కోకొల్లలుగా దర్శన మిస్తున్నాయి. ఈ సమస్య లను చూచి ఏది ముందు, ఏది వెనుకా అని కంగారు పడిపోతున్నాం. తగిన ఆర్థిక వనరులు, మనుష్యబలం లేక సేవా కార్యక్రమాలు కుంటుపడు తున్నాయి. మనలను తికమకపెట్టే మరో అంశముంది. ఇబ్బందుల్లోవుండి బాధపడేవారికి ఎలా సహాయపడాలి? అనేదే ఆ చిక్కు ప్రశ్న. బాధితులలో చైతన్యం కలిగించే విధానం ఒకటయితే వారికి సహాయం చెయ్యటం మరొకవిధానం. అంటే; మనం అజ్ఞానంలో వున్నాం; దరిద్రంలో వున్నాం; మన ఖర్మఫల మింతేనని నిర్వీర్యులము కాకుండా నిద్రమేల్కొని మనం ఎవరికివారు సమస్యలను ధైర్యంగా ఎదుర్కొని పురోగమించాలి. ఆ పద్ధతిలో వారికి చైతన్యం, జాగృతి కలిగించటం ఒక విధమైనసేవగా చెప్ప

వచ్చు. ఆకలి, దారిద్ర్యం, వ్యాధి, నిరక్షరాస్యత, అత్యధిక సంతానం, నిరుద్యోగం, వరకట్న పిశాచం, స్త్రీలపై దౌర్జన్యాలు, మానభంగాలు, అత్యాచారాలలాంటివి సామాజిక జీవితాన్ని కలుషితం చేస్తున్నాయి. వీటికి లోనయిన వారిని ఆదుకోవటం, వీటివల్ల బాధపడేవారికి చేయూత నివ్వటం రెండవ పద్ధతి. ఈ విధానాలు వైవిధ్యం కలవి అయినా రెండూ సంఘ సేవలో అంతర్భాగాలే.

అయితే ఈ సహాయాలు ఒక వ్యక్తిగా చేయుటం దుస్సాధ్యం. సేవా దృక్పథంకల నలుగుర్ని కూడకట్టుకొని ఒక సంఘంగా ఏర్పడాలి. దానినే స్వచ్ఛంద సేవాసంఘం అని చెప్పుకుంటున్నాము. ఆ సంఘంలోని కార్యకర్తలను సంఘసేవకులని అంటున్నాం. స్వచ్ఛందసేవ ఆ సంఘానికి ఊపిరి. ఆ సంఘసభ్యులు మంచి సమర్థులుగాను, నిజాయితీపరులు గాను వుండాలి. సమస్యలను వారు స్వార్థరహితంగానే కాకుండా పరహితార్థరీతిలో చర్చించగలగాలి. ఒక హాస్టలు నిర్వహించాలన్నా, ఒక హాస్పటల్ నెలకొల్పాలన్నా, ఒక వివాహ సలహా కేంద్రం స్థాపించాలన్నా సంస్థా నిర్వహణే దక్షతగల కార్యకర్తలదళం కావాలి. ఒక పథకమూ, ప్లానూ వేసుకోవాలి. దానిని అమలుపర్చటానికి డబ్బు సంతరించుకోవాలి. ఇది అంతా చాలా నేర్పుతో, ఓర్పుతో, సమర్థతతో జరగాల్సిన పని.

మనం చేసే సహాయంవల్ల ప్రయోజనం పొందేవారి సహకారంకూడా వుండాలి. అంటే ఒక వర్కింగు వుమెన్ హాస్టలు కట్టించామనుకోండి అందులో వుండే నిర్వాశితులు ఇది నాది అని భావించాలి. అలాగే ఒక సెప్టిక్‌టాంక్ లెట్రిన్ కట్టిస్తే బాగుచేసే మనిషివున్నా 'మనంకూడా దాన్ని శుభ్రంగా వుంచాలి. అనే భావం దానిని వాడేవారిలో లోపించరాదు. కనుక సంఘ సభ్యులకూ, సేవా ఫలితాన్ని అనుభవించే వ్యక్తులకు మధ్య అవగాహన, సంఘీభావం, స్నేహసౌహార్దాలు, సహకారం వుండాలి.

ఈనాడు సంఘసేవపట్ల ప్రజానీకానికి గౌరవం సన్నగిల్లుతుంది. కారణం ఏమిటీ అని ఆలోచిస్తే అచ్చంగా ప్రభుత్వ గ్రాంట్లకొరకు, పేరు ప్రఖ్యాతుల కొరకు, పదవతి కొరకే సేవాకార్యక్రమాల బ్యానర్లతో తిరిగే వారివల్లేనని చెప్పుకోవచ్చు.

నిజమైన సంఘసేవ అగ్నిపరీక్ష లాంటిది. స్వార్థరహితమైన, సేవా దృక్పథంతో ఆర్తులను, తాడిత పీడిత ప్రజలను వెన్నుతట్టి వారిని సమాజంలో పౌరులుగా నిలబెట్టగలగాలి. సమస్యలతో, బాధలతో, కష్టాలతో, కృంగి కృసిస్తున్న వారికి చేయూత నివ్వాలి. పుట్టుకతో కొందరు దుర్బరులుగా పుడితే ప్రకృతి ఈతి బాధలవల్ల కొందరు అశక్తులవుతారు. కరువుకాటకాల వల్ల, వరదలు, అంటువ్యాధులలాంటి వాటివల్ల వ్యక్తులు నిరాశ్రయులవుతారు దీనావస్థకులోనవుతారు. అనాధలు, భర్తతిరస్కృతులు, వ్యభిచారిణులు, పిచ్చి వాళ్ళు, వ్యాధిగ్రస్తులు అశేషంగా వుంటున్నారు. సమాజ సంప్రదాయాలు, మూఢాచారాలు కొందర్ని పీల్చిపిప్పిచేస్తున్నాయి. వరకట్నం తేలేదనికాల్చి చంపటంలాంటి వాటికి కొందరు బలి అవుతున్నారు. మరి కొందరు దౌర్జ న్యాలకు గురి అవుతున్నారు. నిరుద్యోగులు, అన్నార్తులు, భర్తృ పీడితులు మితిమీరిన బాధలు సహించలేక మానసిక ధైర్యాని కోల్పోతున్నారు. ఈ నానారకాల విషదంష్ట్రల నుండి తప్పించుకోలేని దుర్బరులుగా హతాశులై ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఈ పీడితులకు మానసిక ధైర్యాన్ని కలిగించటం సంఘసేవకు మొదటి మెట్టు. వారికి శారీరకంగా, ఆర్థికంగా, వస్తురూపేణా సహాయ పడటం కూడా సేవక్రిందే లెక్కకు వస్తుంది. వారి బాధతొలగి పోవటానికి తగిన సహాయ సంపత్తులు అందించటమేకాక వారికి వ్యక్తిగతంగాను, స్వచ్ఛంద సంస్థలద్వారాను, ప్రభుత్వ వనరులద్వారా సహాయం కల్పించటం కూడా సేవలోని అంతర్భాగాలే.

ఈనాడు సంఘసేవ సాధ్యమా? అంటే మానవుడికి అసాధ్యమనేది ఏదీ లేదు. అయితే ఈనాటి సమాజం మరీ దుర్గంధభూయిష్ట మయింది. ఎక్కడ చూచినా అవినీతి, లంచగొండితనం, బ్లాకు మార్కెట్ పెరిగిపోయింది. ప్రతి వస్తువూ కల్తీ చేస్తున్నారు. ఆఖరికి ప్రాణాలను నిలిపే మందుల్లో కూడా కల్తీ జరుగుతుంది. మతకలహాలు పెరిగిపోతున్నాయి. కుల వివక్షత విలయ తాండవం చేస్తున్నది. స్త్రీలు చిన్నచూపు చూడబడుతున్నారు. జనాభా విపరీతంగా పెరిగిపోతోంది. నిరుద్యోగసమస్య ప్రళయ తాండవంచేస్తోంది. దోపిడీలు, దౌర్జన్యాలు మితిమీరుతున్నాయి. మానభంగాలు అత్యాచారాలు అసహనంతో చెలరేగుతున్నాయి.

ఈ పరిస్థితుల్లో సమాజసేవ చెయ్యాలంటే ఏదని చేసేటట్లు! ఎలా చేసేటట్లు? అని నిరుత్సాహం కలుగుతుంది; కష్టతరమనే భావన ఉదయిస్తున్నది. ఈ అవినీతి పదుల్లో ఎవర్ని విమర్శిస్తే వారు ధ్వజమెత్తుతారు. ఎన్నిరకాల అడ్డంకులు! మరెన్ని విధాలైన అపరోధాలో! ఆలోచిస్తుంటే ఆశ్చర్యంగా వుంటుంది. అయినా ఈ సమస్యలలోకి తలదూర్చే కార్యకర్తలున్నారు. కారణం మానవుడు విజ్ఞాన జీవి, ఆశాజీవికూడాను. అది అతని ప్రత్యేకమైన విశిష్టత.

ఆహార, నిద్రా, మైథునాలు జంతుధర్మాలు. మానవత్వంగలవ్యక్తులకు జ్ఞాన తృష్ణవుంటుంది. వారిలో ఆర్తి, స్ఫూర్తి వుంటాయి. సామాజిక రుగ్మతలకు బాధపడతారు, ద్రవిస్తారు; ఆర్తులవుతారు. ప్రక్కవాడు అర్ధాకలితో చస్తుంటే తాను కడుపార భుజించలేరు. తనకున్న దానిలో గరిటెడు లో మిల్లెడు అన్నట్లు పంచిపెడతారు. ఇలాంటి స్పందన, ఆర్తి, మానవనైజం లేనివారు పశుతుల్యులు. అణగారిన వ్యక్తులకు మానసిక, శారీరక, ఆర్థిక, విద్యా వైద్య విధానాలలో తోడ్పాటు ఇవ్వడం తన కనీస మానవ ధర్మంగా భావిస్తారు సంఘసేవకులు.

ఈ సహాయమంతా సేవా దృక్పథంతో చెయ్యాలేకాని వారిని ఉద్ధరిస్తున్నామనే అతిశయం పనికిరాదు. కృతజ్ఞతా రూపంలోనైనా ప్రతిఫలాన్ని, పొందాలనుకోవటం నిజాయితీలేని లక్షణమని చెప్పవచ్చు. సహాయం పొందినవారు దూషించినా, తిరస్కరించినా, వ్యతిరేకించినా నిష్కామిగా వుండగల ధీశక్తిగల వ్యక్తే సంఘసేవకు అర్హురాలవుతుంది.

అసలు నిజమైన సంఘసేవ చెయ్యాలంటే ఆ వ్యక్తికి స్వాభావికంగా కొన్ని లక్షణాలుండాలి. ఓర్పు, నేర్పు, సహసం, సౌశీల్యాల, సమయస్ఫూర్తి, సేవాదృక్పథం, గుండెనిబ్బరం కూడా వుండాలి. దూషణ భూషణలకు కృంగుట, పొంగుట పనికిరాదు. ఆటుపోట్లను సహనంతో భరించాలి. ధనంఖర్చు పెట్టాలి, చాకిరీ చెయ్యాలి, కాలం వినియోగించాలి. నోటితో మాట్లాడుతూ, నొసటితో వెక్కిరించేవారి నిందలను సహనంతో భరించాలి. తల్లి తనబిడ్డను లాలించి, పాలించి, ప్రేమతో వాత్సల్యంతో ఎలా చూస్తుందో బాధితులను అలా చూడాలిగాని ఆర్తులలోని లోపాలను మాత్రమే చూడరాదు.

స్వచ్ఛంద సేవకురాలికి చిత్తశుద్ధి, పట్టుదల ఉన్నంత మాత్రానా సరిపోదు. వాస్తవికదృష్టి అవసరం అంటే తన శక్తి యుక్తులను అంచనా వేసుకొని కార్యక్రమాన్ని ఎన్నుకోవాలి. అంతేకాదు సంస్కరణకు, విప్లవానికిగల సంబంధాన్ని గుర్తించాలి. ఆమె తలపెట్టిన ప్రతిపనీ, ప్రతిచర్యా సమాజంలో సమూలమైన మార్పును తేవడానికి దోహదం చేయగల్గాలి. లేకపోతే ఏడుగురు గ్రుడ్డివాళ్ళు ఏనుగును వర్ణించినట్లు సమాజాన్ని పాక్షికంగానే దర్శనం చేసుకోవడం జరుగుతుంది. దానివల్ల సేవ ఫలితం ఆశించిన గమ్యాన్ని చేరలేదు. అంటే రుగ్మతలేని సమాజాన్ని సృష్టించలేదు. కనుక దానికి పరిణతి చెందిన మనస్సు వుండాలి.

సంఘ సేవకు తగినన్ని ఆర్థిక వనరులు సంపాదించటం చాలాచిక్కు సమస్య. సంపద ఉన్నవారికి సేవా కార్యక్రమాలపై వైముఖ్యం దరహం మీదచూస్తే ఉంటుంది. లేనివారికి అభిలాష ఉండి ప్రయోజనం లేదు. ప్రభుత్వ ధనసహాయం అనేక నిబంధనలకు, షరతులకు లోబడివుంటుంది. కార్యదీక్ష కలవారికి అది సకాలంలో తగినంతగా అందక పోయే ప్రమాదం ఎప్పుడూ ఉంది.

సేవాసక్తత, ఆర్థికశక్తి, రెండూవున్నా నిర్మాణ దక్షత లేకపోతే సేవాకార్యక్రమాలు రాణించవు. స్వచ్ఛందసేవా సంఘ సభ్యులలో అవగాహన, సహకారం, సంఘీభావం, ఐక్యత, కలిసి కట్టుగా వ్యవహరించగల సత్తా వుండాలి.

నిజాయితీ, పట్టుదల, దక్షత నిజమైన సంఘసేవకు పునాదిరాళ్ళు. ఫ్లారెన్సు నైటింగేలు తెల్లవార్లూ రోగులు, ఆర్తులు అయిన బాధితుల మంచాల చుట్టూ చిన్న దివ్వెతో తిరుగుతూ వారికి సేవ చేసేది. నిజమైన సేవికకు మిషనరీ జీల్ వుంటుంది. రామకృష్ణా మిషన్‌వారు, సాల్వేషన్ ఆర్మీవారు, ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ వారు ఆ దృక్పథంతో మానవసేవ చేస్తున్నారు, పేరు ప్రఖ్యాతులను ఆశించకుండా పట్టుదలతో, ధైర్యంతో తాను తలపెట్టిన సేవా కార్యక్రమంలో కడదాకా నిలబడాలి. అందుకే మనకు భర్తృహరి సుభాషితం శిరోధార్యం కావాలి. భయంతో ఏ కార్యాన్ని

ప్రారంభించరు అల్పులు. బాధలకు తట్టుకోలేక మధ్యలో మానుకుంటారు మధ్యములు. తుదిదాకానిలుస్తారు ధీరులు అని సుభాషితం మనకు సందేశ మిస్తుంది. అలాంటి ధీరులకే చరిత్రలో స్థానముంటుంది. వారి జన్మ చరితార్థమవుతుంది. సంఘసేవలోపొందే తృప్తి, ఆనందం, అనుభూతుల కన్నా మించిన బహుకృతి ఏముంటుంది? మనం ఎలాబ్రతికాం; ఎంత ఆస్తిని సంపాదించాం, ఏ పదవులను సాధించాం అనేది శాశ్వతమూకాదు;పరమార్థం అంతకన్నాకాదు. మన జీవితంలో ఏ ఘనకార్యాలుచేశాం; ఎవరికి సాయపడ్డాం; మనము, మనకుటుంబాన్ని అధిగమించి ఆలోచించామా! లేదా! అనే విషయం గురించి అనుక్షణం మథన పడాలి. అలాంటి ద్విగుణీకృతోత్సాహం కల సంఘసేవకులు పుంఖాను పుంఖాలుగావచ్చి సమాజ సేవాకార్యక్రమాల్లో పాల్గొన్ననాడే సంఘసేవకు అద్వితీయ స్థానముంది. అసలు మనలో సేవావృత్తి ఏ కొద్దిగానైనా వుంటుంధి. మానసికంగా మనం జాగృతి పొందితే చాలను. నిర్లిప్తంగా ఆలోచించి నిదానిణమైన ప్రజానీకాన్ని మేల్కొల్పి సంఘటితం చెయ్యాల్సిన గురుతరమైనబాధ్యత సంఘసేవలో ముఖ్యమైనది. ఆ అర్హతను మనం పొందగలగాలి. వివేకం జిజ్ఞాస ఉన్న ప్రతి వ్యక్తి సమాజసేవ చేయుటానికి పరితపిస్తాడు. అది ఒకరుకోరితే చేసేదికాదు. ఒద్దంటే మానేది అంతకన్నాకాదు. అందులోవచ్చే కష్టసుఖాలను ఆనందంతో స్వీకరిస్తారు. అదే వ్యక్తికి శాశ్వతానందం. ఈ సమాజం నాకేమి ఇచ్చిందని చూడదు ఆవ్యక్తి; ఈ సమాజానికి నేనేంచేశానని అనుక్షణం పరితపిస్తుంది. అలాంటివారికి సంఘసేవ అసాధ్యముకాదు; అడ్డంకులు అంతకన్నావుండవు.

సమాజంలోని వ్యక్తుల అభ్యుదయాన్ని ఒనగూర్చని జాత్యభ్యుదయం, సమాజాభ్యుదయంమిధ్యలు.



# మహిళోద్యమం :
# మహిళా సంఘాలు

ఈనాడు మారాల్సింది చట్టాలు మాత్రమేకాదు. మహిళలమనస్తత్వాలు కూడా మారాలి. జనభాలో సగంమంది స్త్రీలు. వారు వెనుకబడివుంటే,వారిలో జాగృతి, వికాసం నశిస్తే ఏ సమాజం పురోగమించలేదు. సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాల్లో 50% స్త్రీలు వెనుకబడి వున్నారనేది నగ్నసత్యం. వీరు ఇరుకు సందుల్లో, మురికి కూపాల్లో మగ్గుతున్నంతకాలం మన పథకాలు, అభివృద్ధికార్యక్రమాలు దెబ్బతినకతప్పవు. కనుక స్త్రీ జనాభివృద్ధి అనివార్య మని విస్మరించరాదు. విద్యావిజ్ఞానాలు, బొత్తిగా లేక వ్యక్తిత్వపు విలువే తెలియని నారీలోకానికి సర్వతోముఖ వికాసం కలిగించటమే నేటి మన ముఖ్యకర్తవ్యం. తరతరాలుగా భావదాస్యంతో మగ్గిపోతున్న మన మహిళలకు జ్ఞాన జ్యోతిని వెలిగింటానికి ఒంటరిగా ఏమీచేయలేము. కనుక ఒక ఉద్యమం కావాలి. దాన్నే మహిళోద్యమం అనవచ్చు. అంటే దోపిడి చేయబడే వర్గాలవారే సంఘాలద్వారా తిరుగుబాటుచేసి,ఆ ఉద్యమంద్వారా స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను పొందగలగడం. అప్పుడే స్త్రీల పురోభివృద్ధి వుంటుంది.ఆ కృషి విజయవంతం కావాలంటే దానికినిర్దేశిత లక్ష్యాలువుండాలి. ఆ లక్ష్యాలకు స్పష్టత వుండాలి. ఇలాంటి ఉద్యమాలు ఈ దేశంలో ఎలా నడిచినై ? ఏమి సాధించగల్గినై ? అనేవానికిగత చరిత్రను సమీక్షించి, వర్తమానాన్ని నెమరేసుకొని, భవిష్యత్తుకు అంచనా వేయుట విజ్ఞత.

మహిళాసంఘాల పాత్రను, విశిష్టతను గురించి చర్చించేముందు ఈనాటి మహిళోద్యమ స్వభావాన్ని పరిశీలించటం అవసరం. ఈ నా డు మూడురకాల దృక్పథాలు మహిళోద్యమంలో చోటు చేసుకున్నాయి. మొదటిదాన్ని అచ్చంగా పురుష వ్యతిరేకమైనదిగా పేర్కొనవచ్చు. ఈ సమాజం పురుష నిర్మితమని, దీనిశాసనాలను, నియమాలను పురుషులు స్త్రీలను అణిచిపెట్టటానికి మాత్రమే తయారుచేశారని వీరిభావన. పురుషులను "పురుష దురహంకార సూకరాలు" (Male chauvinistic Pigs) అని

త్తిట్టెదాకా వెళ్ళారు రెండవ వర్గంవారు పురుష ప్రపంచాన్ని విమర్శించకుండానే తమ లక్ష్యసాధనకు కృషిచేస్తారు. మూడవవర్గం సమాజాన్ని పట్టిపీడిస్తున్న, ఫ్యూడలిజం, పెట్టుబడిదారీవిధానం, సామ్రాజ్యవాదం, ఫేసిజం లాంటి సిద్ధాంతాలను, అట్టివ్యవస్థలను ఎదుర్కొంటారు. అంతేకాక పురుష దురహంకారాన్నికూడా వ్యతిరేకించి పోరాడతారు. జాగృతి, చైతన్యముకల అభ్యుదయ వాదులైన పురుషుల సహకారాన్ని తీసుకోవటానికి వెనుకాడరు. ఇది సమతుల్యమైనది, వాస్తవిక దృష్టికలది.

"ఇండియన్ విమెన్సు అసోసియేషన్" అను పేరుతో 1920 లో అఖిల భారత మహిళా సంఘాన్ని ఇంగ్లీషు నేర్చిన మహిళలు నెలకొల్పారు. ఆనాడు ఐ. సి. యస్. ఉద్యోగస్తుల భార్యలు, మితవాద రాజకీయ నాయకుల భార్యలు, సంపన్న గృహిణులు, జమిందార్ల భార్యలు మాత్రమే ఆ సంఘాన్ని నడిపేవారు. సహగమనం, అస్థిహక్కు, బాల్యవివాహం, విధవా వివాహం, అంటరానితనం, సమానత్వాలపై కృషిచేసి కొంతవరకు కృతకృత్యులైనారు. గాంధీ సత్యాగ్రహపు పిలుపు నందుకొన్న స్త్రీలు గాంధీ యుగము అవతరించిన పిదప "అఖిల భారత మహిళా సభ"ను స్థాపించారు ఆ సంఘానికి జాతియోద్యమంతో సంబంధముండేది. దానికి సరోజినీ నాయుడు లాంటివాళ్ళు అధ్యక్షులైనారు.

కమలాదేవి చటోపాధ్యాయ, హంసమెహతా, విజయలక్ష్మీపండిట్, మణిబెన్‌కారా, రామసుబ్బమ్మ, దుర్గాబాయిలాంటి జాతీయోద్యమ నాయకులు ఆనాడు ప్రముఖపాత్ర వహించారు. తర్వాత అరుణా అసాఫాలి, హజరా బేగమ్, రేణు చక్రవర్తి, అచ్చమాంబ ఆ సంఘంలోచేరి యెనలేని సేవ చేశారు. తర్వాత కాంగ్రెస్‌నుండి సోషలిష్టులు, కమ్యూనిష్టులు, కిసాన్‌పార్టీ, రాడికల్స్‌లూ రాజకీయ విభేధాలతో విడిపోయినప్పుడు మహిళాసభపూర్తిగా కాంగ్రెస్ మహిళల సంఘంగా మారిపోయి, ఆనాడది ఇందిరాగాంధీ, సుశీలా నయ్యర్‌లాంటి వారి ఆధ్వర్యంలో పనిచేసింది.

"అఖిల భారత మహిళా సంఘం" నుండి బైటపడ్డ కమ్యూనిష్టు మహిళలు మహిళా సంఘాలు స్థాపించి నిర్మాణ కార్యక్రమాలు,

కొన్ని ప్రాంతాలలో కుటుంబనియంత్రణ ప్రచారం అధికధరలపై నిరసన లాంటికార్యక్రమాలు విరివిగా జరిపారు. 1946 నుండి కమ్యూనిష్టులు నడిపి ప్రజోద్యమాలవలెనే వారి మహిళారంగం కూడా కుంటుపడింది.

ఈనాడు మహిళా సంఘాలు మధ్యతరగతి వారిచే నడపబడుతున్నాయి. మధ్యతరగతి గృహిణుల కోర్కెలు వరకట్నం, ఆస్తిహక్కు, దత్తత, వివాహ ఎన్నిక, విడాకులు, విద్య, ఉద్యోగం, ప్రజాప్రాతినిధ్యాలకే పరిమితంగా వుంటున్నాయి. శ్రామిక స్త్రీల సమస్యలు మంచినీళ్ళు, మరుగుదొడ్లు, ఓటి, వేతనాల వివక్షతలపై ఆరాటంలేదు. అత్యాచారాల లాంటి సామాన్య స్త్రీల సమస్యలు పట్టించుకోవటంలేదు. ఇక ముస్లిం మహిళల పరదా, బహు భార్యాత్వం, తలాక్ లాంటివి వేరుగా భావించటం జరుగుతోంది. అలా శ్రామికవర్గ స్త్రీలను, ముస్లిం మహిళలను మధ్య తరగతి మహిళోద్యమం లోనికి తేలేకపోయ్యారు కార్యకర్తలు. సామాజికంగాను, ఆర్థికంగాను అట్టడుగునవున్న మహిళాలోకాన్ని విస్మరించటం వల్లనేమధ్యతరగతి మహిళా సంఘాలు మరుగునపడి పోతున్నాయి.

కొన్ని చోట్ల శ్రామిక మహిళా సమాజాలు నామమాత్రంగా వున్నాయి వాటికి లక్ష్యాలూలేవు. కార్యక్రమాలు అసలేలేవు, ఇంక డిపార్టుమెంటువారు స్థాపించి లెక్కలు చెప్పే మహిళా సమాజాలు సరేసరి. బాల్వాడీ స్కూళ్ళు, భజనమందిరాలు మాత్రం నిర్వహిస్తాయి ప్రభుత్వ గ్రాంట్లతో. అంతేకాని తమహక్కుల, కోర్కెల సాధనకై ఉద్యమాలుగాని పోరాటాలుగాని నిర్వ హించరనేది నగ్నసత్యం. ఎందుకలా జరుగుతుంది? కారణాలేమిటి? అంటే పట్టణ, గ్రామీణ శ్రామిక స్త్రీలలో విద్యలేకపోవటం; వారిలో సా మా జి క ప్రవ్రహలోపించటం. తమను తాము ఉద్ధరించుకుందామనే ఆలోచనాలోపం, పురుషులు వారికి అవకాశమివ్వక పోవటం, మతాలు, కులాల దురభిమానం, మూఢాచారాలు, మూఢ విశ్వాసాలు, సమాజం చిన్నచూపు చూడటం ఏ స్త్రీ అయినా బైటికొచ్చి హక్కులడిగినా, ఉద్యమం పెట్టినా అది ''బరితెగించిన ఆడదిరా,'' శిఖండిరా, 'ఆడది తిరిగి చెడింది మగాడు తిరక్క చెడ్డాడు' అంటారని స్త్రీలు సంఘాలలో చేరరు. ప్రభుత్వ వ్యవస్థలోను, రాజకీయ పార్టీల నిర్మాణంలోను స్త్రీలకు చోటులేకపోవటం, చైతన్యవంతమైన కార్య

కర్తలు లేకపోవటం ఇలా అనేక ఇబ్బందులవల్ల గ్రామీణ స్త్రీలు, శ్రామిక స్త్రీలు, మహిళా సంఘాలలో చేరటంలేదు.

ధనికవర్గపు స్త్రీల సంఘాలు కొన్ని విందులూ, వినోదాలు, ఆటలు పాటలు, ఫేషన్ పెరేళ్ళూ, దేశపర్యటనలకే పరిమితంగా పనిచేస్తున్నాయి. ఇలాఅనేక కారణాలవల్ల,పరిమితులవల్ల స్వచ్ఛంద సంస్థలు నిర్వీర్యమైపోతున్నాయి. అన్నిటికన్నా ముఖ్యమైనది బాధితులైన వ్యక్తుల్లో ఐక్యత లోపించటం, సమస్యను తనదిగా భావించక పోవటం.

మహిళా సంఘాలు చేపట్టాల్సిన కార్యక్రమాలకు ఒక్కగొంతు చాలదు. కనుక వేలకంఠాలు ఐక్యతతో అరిస్తే కొండలనే పిండిచేయువచ్చు. జాగృతి గల మహిళలు ఇందుకు పూనుకోవాలి. మున్ముందుగా సామాజికస్పృహ కలిగి అట్టడుగునవున్న మహిళా లోకంలో కృషిసాగించగల సత్తా, పట్టుదలా దీక్షాగల కార్యకర్తలు తయారు కావాలి. వారు విధిగా మొదట్లో మధ్యతరగతి నుండే వస్తారు. తర్వాత వారు కార్యరంగంలోకి దిగగానే వారు నడిపే పోరాటాల పర్యవసానంగా అనేకమంది శ్రామిక మహిళలు నాయకత్వ స్థాయికి వస్తారు. కొంతకాలానికి వారే తమ సమస్యల పరిష్కారానికి ఉద్యమాలు నడపగల స్థాయి కొస్తారు. అప్పుడు మధ్య తరగతి కార్యకర్తల అవసరం వుండదు. ఇది నాయకత్వ విషయంగా మహిళా సంఘాలు చేపట్టాల్సిన విధానం. దీనికై సంఘసేవికల శిక్షణా తరగతులను మొదట్లో చేపట్టాల్సి వుంటుంది. ఆవశ్యకతను బట్టి ముఖ్యాంశాలపై దృష్టి కేంద్రీకరించి కార్యక్రమాన్ని నిర్ణయించాలి. ముందు వెనుకలు నిర్ణయించుట ప్రణాళికాలక్ష్యం. నేటి స్త్రీల ముఖ్య సమస్యలు, పరిష్కార మార్గాలు మహిళా సంఘాలద్వారా ఎలా సాధించాలి?

తమ ప్రగతికి, తమ పోరాటాలకు ఇతరత్రాను అవసరం కనుక విద్యకావాలి. తమ ఆరోగ్యానికి, విశ్రాంతికి పిల్లల సంఖ్య తగ్గాలి. కనుక కుటుంబనియంత్రణ కావాలి. ఓటు హక్కుకు, రాజకీయ హోదాకు వయోజన విద్య చాలా ముఖ్యమైనది: అవసరం కనుక దానిని చేపట్టాలి.

స్త్రీ పురుష అసమానత్వ నిర్మూలనకై విధిగా పోరాడాలి. కుటుంబంలో అణచివేత నుండి విముక్తిని స్త్రీలు సాధించాలి.

స్త్రీకి సాంఘిక హోదా పెరగాలి, అది లేనిదే రాజకీయ అభినివేశం, పరివేశం వుండదు. అందుకొరకై ప్రజాప్రాతినిధ్యంలో జనాభా దామాషా ప్రకారం సీట్లకై ఆందోళనచేయాలి. విద్యా, ఉద్యోగం, ఆరోగ్యం లాంటి ముఖ్యవిషయాల్లో స్త్రీల పరిస్థితి బాగుపడాలి.

స్త్రీలలో సంఘీభావం రావాలి. ఒకళ్ళకొకళ్ళు స్త్రీలు ఆదుకునే స్థితి వుంటేనే ఐక్యత లభిస్తుంది. మహిళాభ్యుదయానికి తోడ్పడే సామాజిక జీవనంలోను రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్య సాధనలోను, ప్రజా తంత్ర కార్యక్రమాలలోను సాంఘికప్రగతిలో స్త్రీలు పురోగమించేందుకు మహిళాసంఘాలు ప్రముఖపాత్ర వహించాలి. వ్యక్తి స్వేచ్ఛకోసం, సాంఘిక సంక్షేమం కొరకు, మూఢవిశ్వాస నిర్మూలనకు, అవిద్య అజ్ఞాన నిర్మూలనకు, ముఖ్యంగా స్త్రీల హక్కులకు, స్త్రీ పురుష సమానత్వానికై సంఘాల ద్వారా ఆందోళన చేస్తేనే సమస్యలు పరిష్కరింపబడతాయి. అలాంటి పటిష్టమైన మహిళాసంఘాల నిర్మాణంలో సర్వులూ తోడ్పడగలరని ఆశిద్దాం.

రాజకీయ పార్టీల తోకలుగా మహిళా ఉద్యమాలు ఉన్నాయి. కాని విశాల ప్రాతిపదికపై అఖిల భారత వ్యాప్తంగా ఉద్యమంకాని, సంస్థ కాని లేకపోవటం శోచనీయం. కనుక విద్యా, విజ్ఞానం, వికాసం కలిగిన మహిళలు సంఘాలద్వారా సాటి మహిళలలో జాగృతి కలిగించటం తమ కనీసవిద్యుక్త ధర్మంగా భావించాలి. ఆనాడే మహిళాజాతికి విముక్తి తథ్యం అనకతప్పదు



# స్త్రీ పరాజయ గాథ

అవి దురాచారాలైనా, కాలగతినిబట్టి అర్థరహితాలైనా, ఆచరించ టానికి అనర్హాలైనా, పనికి మాలినవై మన ప్రాణాల్ని తోడేవి అయినా మనం వాటిని ఒక పక్షాన విడిచిపెట్టం. అది మన ప్రత్యేక లక్షణం, మన లక్ష్యం కూడాను. మనం మన విలువలను గుర్తించక పోగా సామాజిక స్పృహను కోల్పోతున్న అయోమయావస్థలోవున్నాం. మన అజ్ఞానంవల్ల మనం నష్టపోతున్న స్త్రీ శక్తిని గుర్తించలేక పోతున్నాం. అదే మన తర తరాల బానిస మనస్తత్వం.

మానవుడు పాశవికదశనుండి పురోగమించినా,ఒకనాటి అసాధ్యాలుఈనాటి సాధ్యాలుగామారినా స్త్రీ జాతి నిద్రాణ దశనుండి మేల్కొనలేదనడానికిఅనేక రుజువులున్నాయి. పుత్రుడికోసం ఎదురు చూచే తల్లి దండ్రులకు "ఆడదే" పుట్టిందే అనే అవమానంతో, బాధతో మొదలవుతుంది ఆమె పరాజయగాథ. ఏ వేడుకలూలేక,ఎవరికీ సంతోషంలేని ఆమె బ్రతుకు అంతాగాఢాంధకారమే. ఆడపిల్ల పెంపకంలో, పోషణలో, ఆదరాభిమానాలలో తేడాతో పెంచబడు తుంది. ఆహారలోపంవల్ల, అశ్రద్ధవల్ల బాలికల మరణాలు హెచ్చని మనం దరికీ తెలుసు. వివాహయోగ్యత వరకు విద్య నేర్పిస్తారు. అంతటితో 'ఫుల్‌స్టాప్.' కట్నమనే దక్షిణతో "సొంత ఆస్తి" క్రింద ఆమెను జమ కడ తాడు భర్తఅనే యజమాని. తల్లి నేర్పిన నీతులతో, ఒద్దికతో, భయభక్తులతో, నీడలా అనుసరిస్తూందా జవరాలు. ఆమె 'పవిత్రతను' రక్షిస్తూ ఆమె సేవలందుకుంటూ ఇంత ఆశ్రయ మిస్తాడు భర్త! ఆమె వ్యక్తి వికాసాన్ని అణచివేసి తెలివితక్కువ దద్దమ్మలా వుండనిస్తారు అత్త మామలు, భర్త. పిల్లలను కనాలి, పెంచాలి అది ఆమె విధి. కాని పిల్లలు మాత్రం భర్త సొత్తు. అతడే వారికి 'గార్డియన్.' అలా దిష్టిబొమ్మలా, దిగ ద్రుడిచిన చెప్పులా, విసిరేసిన విస్తరిలా, జీవచ్ఛవంలా జీవితాన్ని గడుపు తుంది ఆబొమ్మ. అదిచాలక వ్రతాలు, నోములు, పూజలు చేస్తూ, పతిభక్తి పారాయణంచేస్తూ,ఇచ్ఛాపూర్వకమైన పురుషాధిపత్యాన్ని సగౌరవంతోస్వీక రిస్తుందా మహాసాధ్వి. పరమ పతివ్రత, శాంతమూర్తి, పుణ్యకాంత అనే బిరుదులు పొందుతుంది. భర్తతో 'సతి' అనే చితి పోయింది కనుక కఠిన

నియమాలతో, 'ప్రమోషన్'లో అత్తగా రూపొందుతుంది. తనపూర్వస్మృతిని విస్మరించలేక తనకన్నా అబల అయిన కోడలిమీద దౌర్జన్యాన్ని సాగిస్తుంది. కట్నంచాలలేదు కాలుస్తానంటుంది. బిడ్డలు పుట్టని గొడ్రాలు వంటుంది. ఆమెను హింసించటమే తనకు 'హోదా'గా, గౌరవ ప్రతిష్టలుగా భావిస్తుంది. ఇదంతా తన కర్మ అనీ, నోసటి వ్రాతఅనీ కృశిస్తుందా చిన్నారి కోడలు. అయినా ఆ కోడలుపిల్ల ఆడదానికి అదే మహాభాగ్యంగా భావిస్తుంది. అదే మన సంస్కృతి, సంప్రదాయం అని తెలుసుకుంటుంది -ముందు తరాల వారి గాధలువిని. ఇది తరతరాల స్త్రీ పరాజయగాధ.

ఆ తరతరాల బానిసమనస్థత్వం మన రక్తంలో ఇంకా ప్రవహిస్తూనే వుండబట్టి ఈనాడు చట్టం, సమాజం కొన్ని అవకాశాలు మన కిచ్చినా మనలో స్పందన లేదు. నైరాశ్యంతో, స్తబ్దతతో మనం పురోగతిని,మార్పును కోరలేని అసమర్థులమైనాము దీనికి ముఖ్యకారణం స్త్రీ పురుష అసమానత. ఈతేడా సహజమని, ప్రకృతిధర్మమని మనం నమ్ముతున్నాము. ఇలా మన రక్తంలో జీర్ణించిన కర్మసిద్ధాంతం, పిరికితనం, జడత్వం, మూఢ విశ్వాసం, సనాతన సంప్రదాయం మనలను వెలుగును చూడనివ్వవు, ముందుకు సాగనివ్వవు. మనం చాలా మేధావులమని, పవిత్రులమని పొగిడేసుకోవటం మన జాతి లక్షణం; అదిమన పశుత్వ వారసత్వ లక్షణం. అందువల్లే మనలో స్త్రీ పురోగమనమన్నా, స్వేచ్ఛా సమానత్వాలన్నా మనకు 'ఎలర్జీ' వస్తుంది. నేటి మన రాజ్యాంగంలో సమాన ప్రతిపత్తి ఇచ్చినా మనము లాభించలేదు సరికదా పాతకాలపు పతివ్రతా శిరోమణుల కథలు, పురాణాలలో, సినిమాలలో, రేడియోలలో, నాటకాలలో అనుక్షణం మనకు దృగ్గోచరమై మనల్నివెంటాడుతుంటే స్త్రీలు నిరసించకపోగా ప్రశంసించటం జరుగుతుంది. స్త్రీ యొక్క స్వర్గం భర్తపాదాలచెంత అని అన్నిమతాల స్త్రీలు నమ్ముతున్నారు. మీది హీనజన్మ, మీది హీనబుద్ధి, మీరు వేదాలువింటే మీచెవుల్లో సీసంపోస్తాం; చదివితే నాల్కకోస్తాం. వేదాలు మీరు జ్ఞాపకం పెట్టుకొంటే మీకుకఠినదండన తప్పదు. మీకు పురాణ శ్రవణం చాలు, అంటూ స్త్రీలకోసం, ద్విజేతరులకోసం కొన్ని పురాణాలు, పతివ్రతల కథలు రాశారు. రోమన్ సంఘంలో 'స్లేవ్స్' స్పార్టన్ సంఘంలో 'హీలెట్స్' బ్రిటిష్ సంఘంలో జర్మను, రష్యన్ పొలిష్

సంఘాలలో "యూదులను" అమెరికాలో "నీగ్రో"లను అస్పృశ్యులుగా పరిగణించేవారు. ఇప్పటికీ వారిని అలాగే చూస్తున్నారు. స్త్రీలను కూడా అస్పృశ్యతావర్గంలోచేర్చారనుటలో అతిశయోక్తిలేదు;అదిహాస్యాస్పదంకాదు.

విజ్ఞానం అనేది పురుషులకు ఎంతఅవసరమో స్త్రీలకూఅంతే అవసరం. అసలు అజ్ఞానం వల్లనే స్త్రీలు సుసంఘటితం కాలేకపోతున్నారు. తమకేమి కావాలో తామేమి చెయ్యాలో తెలియని అయోమయావస్థలోపడి వున్నారు. ఈ పని పురుషులు చేసిపెడతారు, ఈ సమస్య చట్టం తీరుస్తుంది, అనేభ్రమ పొరపాటని తెలియని పరిస్థితే నేటి స్త్రీల స్థితి, ఈ స్థితికి కారణం సమాజం, మతం, పురుష దురహంకారం అని చెప్పాలి. మన సంస్కృతి స్త్రీలను దేవతలుగానో, బానిసలుగానో తప్ప వ్యక్తులుగా చూడలేదు. అది మన దౌర్భాగ్యం! అదే మన స్త్రీల పరాజయగాథకు మూల కారణమయింది.

అసలు మతదృష్టిలో సమాజం అంటే కేవలం పురుషుడేనని, అతని సేవకు, సుఖసంతోషాల కొరకే స్త్రీ సృష్టింపబడిందనే విశ్వాసంవుంది. ఆ తత్వమే పెద్దవాళ్ళందరి మస్తిష్కాలలో చోటుచేసుకుంది. అందుకే ఆడది ఆధారపడి జీవించే ప్రాణి(పేరాసైట్)గా చూడబడుతుంది. వివాహం, మాతృత్వాలవల్ల ఆమె స్థితి దమనీయమయింది. ఆర్థికాధిపత్యం తగ్గి అణగారిపోయింది. నేటి స్త్రీకి రాజకీయ భాగస్వామ్యాన్ని రాజ్యాంగం ప్రసాదించినా ఆర్థిక అసమానత్వంవల్ల, సాంఘిక అసమానత్వంవల్ల ఆమె రాజకీయాలకు దూరంగా నెట్టబడింది. ఇలా మన రక్తంలో జీర్ణించిన అసమానత్వం,పురుషాధిపత్యం, వివక్షతా మనల్ని ఆధునిక వాతావరణంలోకి పోనివ్వటంలేదు;మనలోని అశాస్త్రీయ దృక్పథం మనల్ని ముందుకు సాగనివ్వటం లేదు.

సంపాదించే ఉద్యోగినులుగాని, సొంత ఆస్తికలిగున్న గృహిణులుగాని స్వేచ్ఛ కలిగిలేరు. వారి ముఖాలలో సంతోషం కనిపించదు. కారణం ఆమె సంపాదనపై, ఆమె ఆస్తిపై భర్తకో, తండ్రికో, ఏ అన్నదమ్ములకో హక్కువుంటుంది. ఇక సాంఘిక నిమ్నోన్నతాలు మనకు తెలియనివి కావు. ఇలా స్త్రీల సాంస్కృతికజీవితాలు విషాదాంకితాలవుతున్నాయి. ఆడది మొగుణ్ణి డబ్బుపెట్టి కొనుక్కోవలసిన స్థితిలో వుందంటే-వివాహం కన్యల

మనసుకూ మమతకూ కాదు; కట్నాలకు, కులాలకు, వంశానికి, అంతస్తుకూ మాత్రమేనని రూఢిగా చెప్పవచ్చు. వేదకాలంనుండి పురాణయుగం వరకూ ప్రబంధయుగంనుండి మనువువరకు, బ్రిటిష్‌వారినుండి నేటివరకు ఏ నాడూ ఏ మతమూ ఏ చట్టాలూ, ఏ ధర్మశాస్త్రాలు స్త్రీని వ్యక్తిగా పరిగణించలేదు. ప్రాచీన భారతీయ సంస్కృతిలో మానవత్వానికి విలువ ఇవ్వబడినా చాలా భాగం మతం, దైవం, భయం, భక్తి, సేవ అనే విషయాలకే ప్రాముఖ్యత నిచ్చారు. పారకాకం అంటే పతిభక్తి అని స్పష్టీకరించింది మన సంప్రదాయం. అందుకే భర్తను 'ప్రత్యక్షదైవం'గా ఆరాధిస్తారు, పూజిస్తారు, తాముమాత్రం తన్నులు తింటారు.

అసలు ఆడదంటే ఇలా బట్టకట్టుకోవాలి. అలా బొట్టు పెట్టుకోవాలి. తలుపుచాటునుండి తలవంచి సమాధానం చెప్పాలి. ఆమె అబల, అజ్ఞాని అణగి మణగి వుండాలి అనే సిద్ధాంతాలు బోలెడన్ని వున్నాయి. అలాగే వారి పనులు కూడా అనేక హద్దులకు, పరిమితులకులోనై వేరుగావుంటాయి. ఒకవేళ ఏ ఆడదయినా అద్భుతమైన పనులుచేస్తే వారికి 'అతీతశక్తులు' న్నాయని హడలి పోతారు. మరి స్త్రీలలో కూడా పురుషులను మించిన ధైర్య సాహసాలున్నవారు లేరా?

వాలంటీనాతెరిస్కోవా రోదసీ విహారం చేసి గ్రహాంతర యానానికి స్త్రీలు వెనుకంజ వేయరని నిరూపించలేదా? జపాన్ మహిళల బృందం ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించి ప్రపంచంలోకల్లా ఎత్తైన శిఖరంపై స్త్రీ శక్తి పతాకాన్ని ఎగురవేసి మహోన్నతాన్ని సృష్టించలేదా! రసాయనిక శాస్త్రంలో పరిశోధనలు చేసి రేడియంను కనుగొన్న మేడంక్యూరి రెండు సార్లు నోబులు ప్రయిజులు సంపాదించలేదా? కృపస్కయా సారథ్యంవల్లనే కదా లెనిన్ సోషలిష్టు విప్లవజ్యోతిఅయి వెలుగొందింది. ఎలియనార్ రూజువెల్టు, హెలెన్‌కెల్లర్, థెరిసా, దుర్గాబాయిలాంటి మరెందరో ఉన్నతోన్నతులు స్త్రీలలో పుట్టలేదా! తగిన అవకాశం, శిక్షణావుంటే స్త్రీలు ఏ రంగంలో పురుషులకు తీసిపోరని రుజువయింది.

స్త్రీని పుట్టుబానిసను చేసిందిమతం. ఆమె వ్యక్తిత్వాన్ని కుంచించింది సమాజం. ఆమె శక్తుల్ని అణచి పెట్టాడు పురుషుడు. దానివల్ల నష్టపోయేది

స్త్రీలేనసే భ్రమలో వున్నారే కాని మొత్తం మానావాళికే అనర్థకం అని మనం గ్రహించకపోవటం మన అవివేకమేకాదు; మత వ్రభావం కూడా.

ఏది ఏమయినా మనం ఆశాజీవులం. జడత్వంనుండే చైతన్యంకలజీవి ఉద్భవించిది; జడత్వానికి ప్రతీకలయిన కొండల్లోనే చైతన్యవంతమైన స్రవంతలుద్భవించాయి ఈ ప్రకృతి సైజాన్నే స్త్రీ జీవితానికి అన్వయిద్దాం; పురోగమిద్దాం.

వెనుకటికి నీగ్రోలు తమ బానిసత్వాన్ని పెయింటింగ్సులో చూపారట. అలాగే నేటి స్త్రీలు తమ కష్టాలను, సమస్యలను సౌజ్ఞలద్వారా, కంటి చూపుద్వారా, రచనల ద్వారా చెప్పాలని ఆక్రోశిస్తున్నారు. వారిలో తప్పటడుగులతో ముందుకొస్తున్నారు. బహుకొద్ది మంది అయినా ఈ మత ఊబిలో దిగబడ్డ మహిళలను ఎలా రక్షించాలి.

చట్టాలద్వారా, ఆర్డినెన్సులద్వారా స్త్రీలలో మార్పుతెచ్చుట దురూహ్యం. చట్టాలకు కట్నాలు పోతయ్యా అన్నట్లు చట్టం అనేది కేవలం పనిముట్టు; అదికొంత రక్షణనిస్తుంది; మరికొంత భయాన్ని కలిగిస్తుంది. కాని మనలో మానసిక దాస్యవిముక్తి రానంతకాలం, మనలో ఆత్మవిశ్వాసం లేనంతకాలం, మనలో శాస్త్రీయ దృక్పథం పుంజుకోనంతకాలం, మనం మూఢవిశ్వాసాలు; దైవభీతి విస్మరించనంతకాలం మనల్నివుద్ధరించేవారుండరు. అజ్ఞానాన్నుండి విజ్ఞానవంతులం కావాలి అంటే మనలో హేతుదృక్పథంరావాలి. దానికై నిరంతరపోరాటం సలపాలి.



వస్తువు, శైలి, కథాకథనం, నుడికారం, భావగమనం, వీటిలో ఏదో ఒకదానిలో నయినా నవ్యత లేనిదే రాయడం అనవసరం.

—

# మన దృక్పథంలో మార్పు రావాలి.

"సగంమంది బానిసలుగా, సగంమందిస్వతంత్రులుగా ఉండే ఏజాతి అయినా అభివృద్ధి చెందలేదు" అని నీగ్రోల బానిస పరిస్థితిపై వ్యాఖ్యా నిస్తూ ఆక్రోశించాడు అబ్రహాంలింకన్. అలాగే జనాభాలో సగభాగమైన స్త్రీలు బానిసత్వంలోపడి సామాజిక స్పృహలేకుండా పూర్తిగా వంటఇంటికీ పడకటింటికీ పరిమితమై వున్నన్నాళ్ళూ ఈ దేశానికేకాదు యావత్ ప్రపం చానికీ విముక్తి లేదు.

ఇంతవరకూ విద్యలో, సాహిత్యంలో, సాంకేతికరంగంలో, శాస్త్రీయ పరిశోధనలలో నిర్మాణ కార్యక్రమాలలో, శాసననిర్మాణంలో వివేకము, విజ్ఞానం ప్రదర్శించాల్సిన రంగాలలో స్త్రీల ప్రాముఖ్యత విస్మరించబడ్డది. అందువల్ల స్త్రీలు పురుషాధిక్య సమాజపు నిరంకుశత్వానికి తలవొగ్గి ముసు గులోనూ, ఘోషాలోనూ తమ జీవితాలను వెళ్ళబుచ్చేవారు. కేవలం లోకం కోసం, పిల్లలకోసం, తిండీ, గుడ్డా, నీడలకోసం వ్యక్తిత్వాన్ని చంపుకొని దిష్టిబొమ్మల్లా బ్రతకటానికి అలవాటుపడ్డారు. గృహిణి ఇంట్లోవారి అవసరా లకు, అహంకారానికి, పరవాలకు ప్రాధాన్యతనిచ్చి తన ఇష్టా ఇష్టాలను, కోర్కెలను చంపుకోవటం త్యాగంగా భావించేది. ఆమె ఎంతగా దాస్యం చేస్తే అంత పతివ్రత అని గౌరవించ బడుతుంది. ఎన్ని కష్టాలనైనా, బాధ లనైనా మూగగా భరిస్తుంటే అంత సాధ్వి, శాంతమూర్తి అని 'టైటిల్సు' ఇస్తారు. మహిళల బానిసత్వ పంజరాన్ని మతం, దైవం, ఆచారం, సంప్ర దాయాలనే బలమైన బంగారు కడ్డీలతో బిగించారు. భర్త అంటే అతని ప్రాముఖ్యత పూర్తిగా భార్యమీద అజమాయిషీ చెయ్యటమేననే భావంతో ఆమెను కొట్టటం, చంపటం, దుర్భాషలాడటం, నీచపదప్రయోగాలు ఉప యోగించటంలాంటివి చేస్తుంటారు.

అసలు మనవాళ్ళు గ్రహించనిదొక ముఖ్యవిషయంవుంది. తండ్రి తల్లిపట్ల ఎలా ప్రవర్తిస్తున్నాడో గమనించి తాము అమ్మపై అలాగే

పెత్తనం వహించాలనే భావం ఆ పసివాళ్ళ మెదడులో నాటుకుంటుంది, తదాది ఆ పిల్లలు తాము ఆడవాళ్ళమీద పెత్తనం వహించాలనే భావం స్థిర పడి పోతుంది. క్రమేపీ ఈ ప్రపంచంలో స్వేచ్ఛా వాయువుల్ని పీల్చటా నికి పురుషుడే అర్హుడని, ఆడది తనకోసమే జన్మించిందనే భావం ప్రబలి పోతుంది.

పిల్లలలో ఈ మనస్తత్వానికి తండ్రులొక్కరే బాధ్యులుకారు. వర్త మానకాలంలో విద్యావంతులై ఉద్యోగాలు చేస్తున్న స్త్రీలు సైతం దీనికి కారకులు. పిల్లలు ఏదయినా తప్పులుచేసినప్పుడు మీ 'డాడీ' (తండ్రి) తో చెప్తానని వారిని బెదరించడం సర్వసాధారణంగా జరుగుతున్నది. అలాంట ప్పుడు తల్లికన్నా తండ్రిగొప్పయని ఆ బాలుడో, బాలికో తలచడం అని వార్యంకదా! ఎందుకిలా ప్రయోజకులైన మహిళలు సహితం ప్రవర్తిస్తు న్నారు? అనాలోచిత చర్యలా అవి? లేక నరనరాల జీర్ణించిపోయిన భావాల ప్రభావమా? పైకి ఎంత స్త్రీ స్వాతంత్ర్యంపై వేదికలనెక్కి ఉపన్యా సాలిచ్చినా, తమ అంతరంతరాలలో అణగిమణగిదాగియుండిన స్త్రీ న్యూనతా భావాన్నివారు వెలికితీసి తమ ఆలోచనాశక్తితో నిర్మూలనం చేయక పోవ డంవల్లనే ఇలా సంభవిస్తున్నది. విద్యమాత్రమే చాలదని, ఆర్థిక స్వాతం త్ర్యం మాత్రమే ఉపకరించదని, ఇతర రంగాలలో వ్యక్తిత్వ ప్రదర్శన ఇచ్చుట లాభించదని తేలుతున్నది. ఎవరినీ నిదించే ఉద్దేశ్యంతో ఇలా వ్రాయటంలేదు. విమర్శ, ఆత్మ విమర్శ ప్రగతికి సోపానాలు.

పిల్లల పెంపకం విషయంలో, తమనడత విషయంలో, తామువాడే మాటల పరంగా, చేతలసందర్భంగా ఎంతో జాగ్రత్తగా తల్లిదండ్రులు వ్యవహరించలేకపోతే పిల్లల మనస్తత్వం పూర్వంలాగానే పురుషాధిక్యతవైపు మొగ్గుతుంది. దీనివల్ల ఈ తరమేకాక ముందుతరాలు కూడా దెబ్బతింటాయి. నారీలోకం విపరీతంగా నష్టపోతుంది. ఈ ప్రమాదాన్ని అరికట్టాలంటే మనందరిలో స్త్రీ పురుషులలో-దృక్పథంలో మార్పురావాలి! మార్పు కను గుణమైన ఆచరణకావాలి.

# హిందూ వారసత్వ సవరణ బిల్లు: ఒక పరిశీలన

హిందూ స్త్రీలకు పురుషులతో సమానంగా ఆస్తి హక్కును ప్రతి పాదిస్తూ 18-3-1983 న ఒక బిల్లును ప్రవేశ పెట్టింది ఆంధ్ర ప్రభుత్వం. 1956లో హిందూవారసత్వ విధానంలో ఆమోదించబడిన చట్టాన్ని ఈ బిల్లు సవరణ చేస్తుంది. ఈ బిల్లు ఉపక్రమణిక (Preamble) లో చెప్పిన సూచనలు పిత్రార్జితపు ఆస్తిలో ఆడపిల్లకు భాగంలేనందువల్ల వరకట్న పిశాచం పుట్టి అది సాంఘిక దురాచారంగా మారింది. హిందూసమాజంలో స్త్రీల పరిస్థితిని మెరుగుపర్చటానికి రాజ్యాంగంలో పొందుపరచిన సమానత్వ సిద్ధాంతానికి పురుషులతోపాటు స్త్రీలకు హక్కు ఇవ్వబడుతుంది. సమానత్వం అనేది మౌలిక హక్కుగా రాజ్యాంగంలో రాయబడింది కనుకనూ, కూతురికి పిత్రార్జితంలో తండ్రి, కొడుకులతోపాటు ఆస్తి హక్కులేకపోవడం తద్విరుద్ధం కనుకనూ, అది వరకట్న దురాచారానికి దారి తీసింది కాబట్టి ఈ దుర్నీతిని రూపుమాపటానికి ఈ బిల్లు ప్రవేశపెట్టబడిందని ఈ బిల్లు లక్ష్యాలు సూచించాయి. ఆంధ్రగెజెట్‌లో ప్రకటింపబడిన తేదీనుండి ఈ బిల్లు అమల్లోకివస్తుందని, దానికి ముందుగా ప్రెసిడెంటు సమ్మతి కావాలని బిల్లులోవుంది.

## బిల్లులోని ముఖ్యాంశాలు:-

1) కుమారునకు ఎలాంటి ఆస్తి హక్కులున్నాయో కుమార్తెకు కూడా అలాంటి హక్కు ఈ బిల్లుద్వారా సంక్రమిస్తుంది.

2) అంతకు ముందు చనిపోయిన కొడుకు సంతానానికి పిత్రార్జితపు ఆస్తిలో వాటావుండేది. ఇప్పుడు అలాంటి కూతురు సంతానానికికూడా వాటా వస్తుంది. దాని మీద సర్వహక్కులూ వారికి వుంటాయని పేర్కొన్నది ఈ బిల్లు.

3) పిత్రార్జితపు ఆస్తి నివాసానికి పూర్తిగా వాడుకునే ఇల్లయితే ఆ ఇంటిని పురుషులు పంచుకుంటేగాని కూతురు అడగటానికి హక్కులేదు. కాని ఒక ప్రక్క ఆమె మాత్రం నివసించవచ్చు. అదైనా ఆమెకు పెండ్లి కానప్పుడు, విధవరాలయితే, భర్త విడచిపెడితే, భర్తనుండి వేరుగావున్నప్పుడు ఆ ఇంట్లో ఆమె వుండవచ్చు.

4) ఈ ఆస్తిని గురించి ఆమె వీలునామా రాయవచ్చు.

5) పిత్రార్జితం పంచుకోకుండా ఆమె చనిపోతే ఆ ఆస్తి భర్తకురాదు. ఇది ఈ బిల్లుయొక్క సారాంశము. ఈ బిల్లు 1956 నాటి వారసత్వ చట్టాన్ని సవరణచేస్తుంది కనుక అప్పటినుండి అమల్లో వున్న స్త్రీల ఆస్తి హక్కును వివరించక తప్పదు.

హిందువుల్లో తండ్రీ, కొడుకులూవుంటే, ఆ సమిష్టికుటుంబం వారికి పిత్రార్జితపు ఆస్తివుంటే, తండ్రి చనిపోతే ఆ తేదీన పంపిణీ జరిగినట్లుగా ఊహించుకొని తండ్రివాటా నిర్ణయిస్తారు. అతడు వీలునామా రాయకపోతే ఆస్తి కుమారులకు, కుమార్తెలకు, అతని తల్లికి, భార్యకు సమాన వాటాలుగా సంక్రమిస్తాయి. ఇది 1956 నుండి అమల్లోకి వచ్చిన శాసనం. 1937 తరువాత 1956 లోపల చనిపోయిన అతని వంతు ఆస్తి అతని భార్యకు వచ్చేది. స్వార్జితపు ఆస్తిలో అతని కొడుకులతో అతని భార్యకు సమానవాటా వచ్చింది. అయితే ఆనాడు ఆమెకు జీవితకాలపు హక్కుమాత్రమే వుండేది. 1956 తరువాత చనిపోయిన ఆయన భార్యకు ఆమె వాటా సర్వహక్కులతో వచ్చింది. అయితే అంతకుముందు కూతుళ్ళకు జన్మతః వచ్చేదికాదు. ఇప్పుడు ఈబిల్లువల్ల కూతుళ్ళకు కూడా వస్తుంది.

## బిల్లులో చేర్చవలసిన విషయాలు:-

1) 1956 నుండి అమల్లోవున్న చట్టంవల్ల జీవితకాలపు హక్కుకు బదులు భార్యకు సర్వహక్కులూ వచ్చాయి. కాని ఆమె వాటా మాత్రం నీరు కారి పోయింది. ఈనాటి శాసనం ప్రకారం ఒక కుటుంబంలో **A, A** కు

ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు, భార్య తల్లి, ఉన్నారను కుందాం. A పిత్రార్జితపు ఆస్తిని తన కుమారులతో పంచుకోకుండా చని పోతే అతని ఆస్తి $\frac{1}{4}$ వంతు ( అతడుము+గ్గురు కుమారులు = 4 ) వాటాను పై చెప్పిన అందరూ పంచుకుంటారు. అంటే A భార్యకు $\frac{1}{8}$, A తల్లికి $\frac{1}{8}$, కుమారుడికి ఒక్కొక్కడికి $\frac{1}{4}$, కుమార్తె ఒక్కంటికి $\frac{1}{8}$ అతని వాటాలో వస్తాయి. అంటే మొత్తంలో $\frac{1}{4} \times \frac{1}{8} = \frac{1}{32}$ వస్తుంది. అంటే A భార్యకు $\frac{1}{32}$ సర్వహక్కులతో వస్తుంది. A కుమారులకు జన్మతః $\frac{1}{4}$ వేరే వస్తుంది. కనుక, 56 సవరణవల్ల స్త్రీకి లాభించేవాటా అత్యల్ప మయింది.

ఈనాటి బిల్లు ప్రకారం A, అతని ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు 'కోపార్సనరీ'లో భాగస్థులు. అంటే ఒక్కొక్కరికి మొత్తంలో జన్మతః $\frac{1}{7}$ వస్తుంది. A వాటాలో A భార్యకు మొత్తంలో $\frac{1}{7} \times \frac{1}{8} = \frac{1}{56}$ వస్తుంది. A పిత్రార్జితపుఆస్తిని కష్టపడి వృద్ధిచేసిన A భార్యకు ఈబిల్లు చేసిన 'మహోపకారం' ఇది.

ముస్లిం లా ప్రకారం సంతానం లేని స్త్రీకి $\frac{1}{4}$ వంతు, బిడ్డలుంటే $\frac{1}{8}$ వంతు భర్త ఆస్తిలో సర్వహక్కులతో సంక్రమిస్తుంది. మిగతా ఆస్తిలో కూతురుకు రెట్టింపువాటా కొడుకుకు చెందుతుంది. కనుక ఇస్లాంలో భార్యకు తక్కువ వాటా ఒకటి కొడుకు వాటాలో సగం కూతురికి రెండువిధాలా స్త్రీకి న్యాయం జరగటంలేదు. క్రైస్తవులకు వర్తించే 1925 భారత వారసత్వపు శాసనం ప్రకారం భార్యకు $\frac{1}{3}$ వంతు వస్తుంది. సంతానం లేని స్త్రీకి సగం వాటాకు హక్కువుంది. మొత్తంమీద అన్నిమతాల వారసత్వ సూత్రాలు భార్యలకు అంతగా లాభం చేకూర్చటంలేదు.

భార్యవాటా పెంచటం విషయమై ఈ బిల్లులో ఉదహరించలేదు. కూతుళ్ళ విషయం ప్రస్తావనవుంది. కాని భార్యవాటా విషయం గమనించక పోవటం శోచనీయం. A వీలునామా రాయకుండా చనిపోతే పిత్రార్జితపు ఆస్తిలోని అతని వాటాలోగాని, స్వార్జితపు ఆస్తిలోగాని సగం A భార్యకు-పిల్లలున్నా సరే కేటాయించాలి. దానికి అనుగుణంగా 1956 వ చట్టపు 8వ సెక్షన్‌ను తగువిధంగా సవరించాలి. ఇది అవశ్య కర్తవ్యం.

ఈనాటి బిల్లులోని పొరపాట్లు ఏమిటి? వాటిని ఎలా సవరించాలి అనేవి నేటి ప్రశ్న.

1) 1వ సెక్షన్ 3వ క్లాజులో, ఈ బిల్లు చట్ట రూపందాల్చినా, గెజెట్‌లో ప్రకటించబడిన తేదినుండి మాత్రమే అమల్లోకి వస్తుందనటం అన్యాయం; అవివేకం. 18-12-1982 నుండి అమల్లోకి వస్తుందని మార్చాలి. లేనిచో చాలామంది పంపిణీలు చేసుకొంటారు.పంపిణీకి హద్దులువేసుకొని చేసుకోనక్కరలేదు. నోటిమాటరీత్యా తండ్రి, కుమారులు విభక్తులు కావచ్చు. అప్పుడు "కోపార్సనరీ" ఉండదు కనుక, కూతుళ్ళకు ఏ మా త్రం ఆస్తిరాదు. అందువల్ల బిల్లు ప్రకటించిన తేది 18-3-83 నుండి ఒక సంవత్సరం వెనుకనుండి 18-3-82 నాటికే ఈ బిల్లు అమల్లోకివచ్చినట్లు ఎంచుకోమనే సవరణ చాలా అవసరం.

2) సెక్షన్ 29 **A** చివరిలో సమిష్టి హిందూ కుటుంబంవారు కాపురానికి పూర్తిగా వాడుకునే ఇంటి విషయంలో ఆడపిల్లకు కొన్ని ఆంక్షలువున్నాయని చెప్పుకున్నాం. ఆమె భర్తతో ఆ ఇంట్లో నివాసానికి అనర్హురాలు. ఇది అన్యాయం; ఇది కూతురికి కొడుకుకు మధ్య వివక్ష, కోడలు కూ అల్లుడికి మధ్య వివక్ష. అంటే కొడుకు తన భార్యతో ఉండవచ్చు;కూతురు తన భర్తతో కాపురముండే అర్హతలేదు. అల్లుడూ కోడలూ,'కోపార్సనరీ'కి పరాయి వాళ్ళయినప్పుడు ఈ తేడా న్యాయమా?

3) సెక్షన్ 29 **B** లో కూతురు అవిభక్తురాలిగా చనిపోతే, ఆమెకు పిల్లలు లేకుండా భర్త మాత్రమే ఉంటే "కోపార్సనరీ"లో ఆమె వాటా ఆమె భర్తకు చెందకుండా తండ్రికి లేక సోదరీ సోదరులకు చెందుతుంది. 1956 చట్టం సెక్షన్ 6 ప్రకారం కుమారుడు 'కోపార్సనరీ' లో భాగస్తుడుగావుండి చనిపోతే అతనివాటా కొంత అతని విధవకు చెందుతుంది. ఈ బిల్లు ప్రకారం కూతురు ఆస్తి ఆమె భర్తకురాదు. ఇలా తేడాలు చూపడం ఉపక్రమణికలో చెప్పిన సమానత్వం అనే లక్ష్యానికి విరుద్ధం. ఇలావుంటేనే కూతురుకు భద్రత అనివాదిస్తున్నారు కొందరు. కాని వివాహం కాగానే గాని వివాహానికి పూర్వంగాని అల్లుడు ఆమె చేత

నోటీసు ఇప్పించి ఆమెను విభక్తురాలినిచేసే ప్రమాదం ఎలాగూవుంది. కనుక ఇది సహేతుకమైన అభ్యంతరం కాదు.

ఈ బిల్లు 1956 చట్టం ఆస్తుల (Blending) కలుగలుపు సూత్రాన్ని మార్చలేదు. అంటే ఎవరైనా ఆస్తిసంపాదించి కుటుంబాస్తిలో కలిపితే మొత్తం "కోపార్సనరీ" ఆస్తి అవుతుంది. నేటి బిల్లు వల్ల ఆడపిల్ల "కోపార్సనరీ" అవుతుంది. ఆమె ఆస్తి పుట్టింటి ఆస్తితో కలిపితే ఆమె నష్టపోతుంది. కనుక ఎట్టి పరిస్థితిలోనూ కూతురి ఆస్తికి కలగలుపు సూత్రం వర్తించదని స్పష్టంగా ఒక నిబంధన ఏర్పరచాలి. ఇవి నిర్మాణాత్మకమైన సూచనలు.

ఈ బిల్లు కేవలం హిందూ స్త్రీలకే వర్తిస్తుంది. ఇది చాలా ఘోరం. కనుక ఇస్లాం, క్రైస్తవ శాసనాలుమార్చి కామన్ సివిల్‌కోడ్ (Common-civil code) ప్రవేశపెట్టి ఈ ఆస్తి హక్కును వారికికూడా చెందేలా చెయ్యాలి. 1950 నాటి రాజ్యాంగంలో 44 అధికరణంలో ఒకే వ్యవహార సంహిత సృష్టీకరింపబడి 33 సంవత్సరాలైనా ఇంకా ప్రయత్నించకపోవటం శోచనీయం.

ఈ బిల్లు చట్టమైతే వ్యవసాయభూములు ముక్కలు చెక్కలవుతాయని ఇళ్ళు గదులుగా మారతాయని; పరిశ్రమలు చిన్నాభిన్న మవుతాయని; కుమారుడు తిలోదకాలకు కర్తకాడని; వంశాలు, కుటుంబాలు చెల్లాచెదరైపోతాయని ముఖ్యంగా తల్లిదండ్రుల బాధ్యత కుమారుడు స్వీకరించడని తర్జన, భర్జనలు చెలరేగుతున్నాయి. ఈ వింతడవాదాలు సర్వసామాన్యాలే కదా! 1956 లో హిందూకోడ్ బిల్లు పార్లమెంటులో చర్చకొచ్చినప్పుడు స్త్రీలు సైతం ఆస్తి హక్కు తమ కొద్దని వ్యతిరేకిస్తూ కరపత్రిస్వామీజీ ఆధ్వర్యంలో ఆలజడిచేసి మాన్పించలేదా! ఆ బిల్లు ముక్కచెక్కలై పోలేదా! అలాంటి తిరోగమన వాదులు సర్వకాలాల్లోనూ వున్నారు.

ఇక ఈ బిల్లు వల్ల వరకట్నం పోతుందా అనే అపహాస్యం వినపడుతుంది. అంతేకాదు ఇటు కట్నం ఇవ్వాలి అటు ఆస్తివాటా ఇవ్వాలి; ఇక మగబిడ్డకు మిగిలేది నెత్తిన ముసుగే అంటున్నారు అనేకమంది. అసలు

కట్నం తీసుకోవడం అనేది మన మనస్థత్వంమీద ఆధారపడి వుంటుంది. ఆస్తి పరులైన ఆడపిల్లలయినా, విద్యావంతులైన యువతులైనా, ఉద్యోగినులైన మహిళలకైనా కట్నం ఇవ్వక తప్పడంలేదు. మగాడికి కట్నం గౌరవచిహ్నంగా మారింది. ఆడపిల్లలను కన్నవారికి అదొక జరిమానాగా మారింది. దానికి కారణం స్త్రీ పురుషుల మధ్య వ్యత్యాసం; ఆడదంటే అనాదరణ, అలుసు, ఆమెకే భర్తకావాలేమో! మరి పురుషులకు భార్య లొద్దేమో! ఆలోచించాలి. అప్పుడే కట్నకానుకలు కాక "క్రొత్త బిల్లు తెలుసా? ఆస్తి పిల్లపేర పెట్టాలిసుమా!" అనే హెచ్చరికలు వింటున్నాం. కనుక చట్టాలకు కట్నాలుపోవు. మునుపున్న చట్టాలవల్ల స్త్రీలు ఏ మాత్రం లాభించారు? చట్టాల విలువ తెలుసుకోగలస్తోమత స్త్రీలకు లేనందువల్లనే ఈ పరిస్థితి ఏర్పడింది.

అసలు ఏ హక్కులు అయినా అనుభవించకపోతే అవి నశిస్తాయి. **(Deadrights)** అవుతాయి. చట్టం అంటే అదొక అగ్నిలాంటిది. అది ఆహారాన్ని పక్వం చేస్తుంది; ఇళ్ళను తగులపెడుతుంది. కనుక చట్టాలను గౌరవించటం, అనుభవించడం అదొక విజ్ఞత.

ఈ ఆస్తిహక్కువల్ల స్త్రీకి కొంతరక్షణ, ఆత్మస్థయిర్యం, వ్యక్తి వికాసం వస్తాయి. ఈ బిల్లులో కొన్ని లోపాలున్నా ఇది చాలా ఉత్కృష్టమైనది. అయితే ఇలా సవరణలు చేయడంకన్నా పూర్తిగా స్త్రీల ఆస్తిహక్కుకు ప్రత్యేక చట్టంచేస్తే బాగుండేదేమో! ఏది ఏమయినా, ఈ బిల్లు పెట్టిన ఘనత ముందుగా ఆంధ్రప్రభుత్వానిదేకనుక వారిని శ్లాఘించాలి.

ఒకే వ్యవహార సంహిత ఏర్పడేదాకావేచి వుండేకన్నా ఇలాంటి విప్లవలక్షణాలున్న బిల్లులు ఇతర రాష్ట్రాలలో రావాలి. కేంద్రంచేపట్టాలి. తదితర మతాల స్త్రీలకు లాభించే శాసనాలు కావాలి.

# నలిగిన న్యాయం

అదిచక్కని పల్లె,
బారులయిన వీధుల్
తీర్చిదిద్దిన ఇళ్ళు,
అందంచక్కని పడుచు.

నిన్నగాక మొన్న
తరలివచ్చింది తను
అత్తవారింటికి
అతి సంరంభంతో.

మేళాలు తాళాలు
మిన్ను ముట్టాయి
ముత్తయిదువులంతా
మురిపాన ఇచ్చారు హారతి.

నునుసిగ్గు, గొంకు భయము
మనమున ముప్పిరిగొనగా
అడుగిడినది ఆ యమ
అత్తింట అతి సంభ్రమంగా

ఒడిలో బియ్యం
మెడలో సూత్రం
ఎదలో భయం
ఆ యమ రూపం

చూచింది ప్రీతితో పతిని
చూచింది వణుకుతో అత్తనూ
మరుదులన్ వదినలన్
ఆడబిడ్డలన్ ఆదరాన.

వీడి వచ్చినది ఉన్న ఊరిని
వీడి వచ్చినది తనవారిని
వీడి వచ్చినది సంగాతగాళ్ళను
వీడి వచ్చినది ఆటపాటలన్.

తెలియని సంతోషం
ఊహించని భయం
అదేమో అనుమానం
అసలే క్రొత్తదనం.

ఎవరున్నారు తనవారూ
ఏరీ నా యనువారూ
రానే వచ్చాడూ
తన తోడూనీడా.

ఎగిరి పోయినది వ్రీడా తనం
తొలగి పోయినది సంకోచం
సేద దీరినది హృదయం
కరిగి పోయినది స్వాంతం.

గడిచాయి రోజులు
సాగాయి మాసాలు
ముద్దు మురిపాలతో
మోహ భావనతో.

వీచింది ఊదరగాలి
ఎగిరింది ఆకాశంలో
తన హృదయ పటలం
చీకాకయింది జీవితం.

భర్త గాడతడు ఘోరవ్యాఘ్రం
అత్తగాదామె క్రూరసర్పం
ఆడబిడ్డగాదామె సృగాలం
తానేమో మూగజీవం.

గాండ్రించాడు భర్త
చాలీచాలని కట్నం
బుసకొట్టింది అత్త
పేలవమైన లాంఛనాలు.

ఈసడించింది ఆడుబిడ్డ
గుసగుసపోయింది తోటికోడలు
నోరునొక్కుకుంది మరదలు
వికవికలు పోయాడు మరిది.

భరింప లేని వేదన
తరింప లేని జీవనం
కన లేని కాంతుడు
విన లేని శ్వశురుడు.

పంజరం లోని పక్షి
కారాగారం లోని బందీ
జూ లోని మృగం
తన రక్షణ మృగ్యం.

కలయ చూచింది ఇంటా
వెదకి చూచింది బయటా
ఎందు చూచినా శూన్యం
సహాయ సాధనం.

అది కాళ రాత్రి
అది భయానక రాత్రి
వాటేసుకున్నది వ్యాఘ్రం
కాటేసినది కాలసర్పం.

అతిలోక భయానకం
ఆమె రూపం,
స్రవించెను కన్నుల రక్తం
కంపించెను శరీరం.

పట, పట, పట
ఫెళార్భటులతో
విది లించెను విభుని
అదలించెను అత్తను.

కంట పడెను కత్తిపీట
వెంట పడెను వేగంగా
చేసిన వేటుకు విభుని
సాగనంపెను సత్వరంగా.

మరదలు పిల్లా
అత్తా మామా
పారి పోయిరి
బ్రతుకు తీపితో.

సగం కాలిన దేహంతో
సగం మండిన చీరెతో
సగం మాడిన జుట్టుతో
సగం నిండిన జీవితంతో.

పరుగిడింది
పోలీసు స్టేషనుకు,
చెప్పిన నిజానికి
చేటు వచ్చింది తనకూ,

మనిషైతే బ్రతికింది
కేసయితే మిగిలింది
న్యాయం బుగ్గి అయింది
తను చెరసాల పాలయింది.

| | | రు. పై. |
|---|---|---|
| హేతువాదం అంటే: | ఎం. వి. రామమూర్తి | 4—00 |
| ఎమర్జెన్సీలో జైలు అనుభవాలు | ,, | 3—00 |
| ఆధునిక స్త్రీ | మల్లాది సుబ్బమ్మ | 12—00 |
| మనం దేనికి బానిసలం? | | 3—50 |
| వెలిగిన జ్యోతి | ,, | 12—00 |
| తల్లే పిల్లను చంపితే | ,, | 3—50 |
| విముక్తి ఉద్యమాలు:మహనీయులు | ,, | 3—50 |
| ఓ మహిళా! ముందుకుసాగిపో | ,, | 7—00 |
| మారుతున్న సమాజం మహిళలు | ,, | 5—00 |
| మహిళా అభ్యుదయం | ,, | 15—00 |
| మాతృత్వానికి మరోముడి | ,, | 12—00 |
| ఎం. ఎన్. రాయ్ జీవితం: సిద్ధాంతం | కోగంటి రాధాకృష్ణమూర్తి | 25—00 |
| గాంధీమార్గం | ,, | 12—00 |
| నవ్యమానవవాదం ఎం.ఎన్.రాయ్ | అ॥ఎం.జి.కె. & ఎం.వి.ఆర్. | 6—00 |
| ఫాసిజం ,, | రావిపూడి వెంకటాద్రి | 7—00 |
| మానవనాగరికత ,, | డా॥ భట్టిప్రోలు హనుమంతరావు | 8—00 |
| నాస్తికత్వం: నాస్తితత్వం | రావిపూడి వెంకటాద్రి | 12—00 |
| మహామనిషి: ఎం. ఎన్. రాయ్ | కొల్లా సుబ్బారావు | 8—00 |
| ఎం.ఎన్.రాయ్: భారతకమ్యూనిజం- | రావిపూడి వెంకటాద్రి | 45/60—00 |
| శాస్త్రీయ దృక్పథం | ఎన్. ఇన్నయ్య | 4—00 |
| సెక్యులరిజం | పి. సత్యనారాయణ | 3—00 |
| స్వేచ్ఛాపథంలో (ఆ. గో. కృ. సంచిక) | | 5—00 |
| కమ్యూనిజానికి అవతల - ఎం. ఎన్. రాయ్. | అ॥ ఎం. వి. రామమూర్తి | 10—00 |
| ఎం.ఎన్.రాయ్. భారతనారి ఆదర్శం | ,, | 10—00 |
| ఆం. ప్ర. లో హేతువాద ఉద్యమం ఎం. వి. ఆర్. | మల్లాది సుబ్బమ్మ | 2—00 |

ప్రజాస్వామ్య ప్రచురణలు **వికాసం**

9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మోహిదీపట్నం,

హైదరాబాదు. 500 028. ఫోను 31423.